శ్రీరస్తు

# ముత్యాలహారము



గ్రంథకర్త:

## [redacted] వి. యస్. నారాయణమూర్తి [redacted]



మొదటికూర్పు 1000 ప్రతులు

ప్రకాశకులు:

దొంత్తంశెట్టి చంద్రయ్య అండు బ్రదర్

శ్రీ పరమేశ్వరీ బుక్ డిపో, రాజమండ్రి.

శ్రీ లలితా ప్రెస్‌నందు ముద్రితము,

రాజమహేంద్రవరము.

1 9 3 4

 — [వెల రు0—12—0

# విషయ సూచిక



# ముత్యాలహారము



## మొదటి ప్రకరణము.

—o—o.—

### మో గి

ప్రభాకరుఁ డుదయాద్రి నలంకరించెను. భీమపాలుఁడు స్నానాది కృత్యముల నాచరించి జ్యేష్ఠభార్య యగు మోహిని భవనమునకు వచ్చెను. మోహిని నాని కెదురేగి స్వాగతమిచ్చి, భామినీ యుపచరణముల నొంది భవనములోనికేగిసోఫాపై గూర్చుం డేదియో యోచించుచుండెను. మోహిని ఫలహారములఁ దెచ్చి మేజాపై నుంచెను. భీమపాలుఁడు ఫలహారముల సేవింపక యోచనాతత్పరుఁడై యుండుటఁజూచి, నేడేలకో యోచనాతత్పరులై యుండిరి! కాల విపరీతముచే నాభవన మెంతయో కాంతివంతమైనది! పాపమీ హృదయమేలనో నా హర్మ్యమును కాంతివంతముఁ జేయ యూహించినదిగాబోలు, మీ వలపుల రాణియగు మా చెల్లెలు నళిని భవనము కళాహీనమగుఁనుడీ! ఊరకే గంటఁగవలెనుగాని మాబోటి బోటి కోరి నచోఁ వచ్చియుందురా? ఏది ఎటులున్న దిగంత విశ్రాంతకీర్తి

నీయంబగు భరతఖండంబున బరమసుఖాస్పదంబై, హాటకవజ్ర మణిప్రభలం ప్రదీప్తములై విరాజిల్లు సౌధరాజంబులు గలిగి, సకలజన సమృద్ధంబై విరాజిల్లు రత్నగిరి సామ్రాజ్యాధిపులైన మీరు యోచనాతత్పరులై యుండుటకు కారణం బేమైయుం డునని మోహిని బలుక, భీమపాలుఁడు నిట్టూర్పువిడిచి కట్టా ఎట్టికష్టముల నొందిననైనను, దేశ దేశాంతరముల కేగినయైనను తిరిగి తిరిగి యెట్టివస్తువునైనను దేవచ్చునుగాని సృష్టిస్థితిలయ కారుని కరుణ నొందుట యెంతకష్ట మెంతకష్టము! పాపినై జ న్మించితిని గాబోలు నాకొక్క పుత్రుండయినను గలుఁగకుండె నేనీ లోకమును బాయుట నిమేషము; గాని నాకు తిలోదకం బుల విడచువా డొక్కఁడయినను లేకుండెగద! భగవంతునిదూ షింపనేల! అల్ల దెంతయు నాపూర్వజన్మ కృతమే యనవచ్చు ను. మోహిని తనలో నూతఁడేలకో యీదినమున వైరాగ్య చింతనమున మునిఁగియుండె. గొన్ని హితవచనముల బలికి ధ యిర్యమును బురికొల్పు దాననని ప్రకాశముగ మీదాసి మీ వద్ద నున్నంతకాలము మీరు చింతింపవలదు. ధయిర్యమూ నుడు. ఏనాటికెట్టి సౌఖ్యము చేకూరునో యెవరికెరుక? మన పూర్వజన్మ కర్మలవలననో లేక కష్టముల పాలుసేయుటకో విధియ ట్లువ్రాసియుంచె. విచారింపవలదు. భగవచ్చింతనమున మన ము కాలమును గడపినచోఁ ఏనాటికైనను యాపరాత్పరుఁడు మనపై దయగలుగగలడు.

కాంతా! నీవట్లో దార్చితివి గాని—'కాకిపిల్ల కేమి దెలియు వుండీలు దెబ్బ' యన్నట్లు నీకేమి దెలియును? రాజ్యభారము నను మూపున నిడుకొని దేశము సుభిక్షముగ నుండునటుల పాలించుచుండవలెను. కేవలము భగవచ్చింతనముతోఁ గాలముఁ గడుపుదుమేని ప్రజలకు బాధలు వాటిల్లగలవు. సంతానము లేకపోవుటచే మనకు పరలోకసౌఖ్యము లేనేలేదుగద; ఆసేతు హిమాచల పర్యంతము వంశపారంపర్యాయముగ మనకు లోబడియున్న రాజ్యము పరరాజుల చేతఁబడు టెంతటి హాస్యాస్పదమగు విషయమోగద! అంతలో భటుండొకడు ప్రవేశించి రాజునకు నమస్కరించి 'అయ్యా! శరీరమున కంతకును విభూతిని బులుముకొని, కృష్ణాజినమును భుజమునకు దగిలించుకొని, వామకరమున కమండలమును బూని, దక్షిణ హస్తముతో జపమాలను దిప్పుచు భగవన్నామ స్మరణ జేయుచు, యోగీశ్వరుఁ డొకడు తమ దర్శనమును గోరి గోటద్వారము వద్దకు వచ్చి వేచియుండెను. భీమపాలుఁ డులికిపడి 'అవశ్యము వారినిటకు దోడ్కొనిరమ్ము.' జై శంకర్! జై విశ్వనాథ్, అనుచు యోగి మోహినీ మందిరమునకు వచ్చెను. మోహినీ భీమపాలు రిరువురును యోగికి వందన మాచరించి మీరీ యుచితాసము నధిష్ఠింపుడని బలికిరి. యోగి వారి నాశీర్వదించి 'బాబా! కూర్చొనుడు' అని బలుకుచు గూర్చుండెను. భీమపాలుఁడు యోగియొక్క పాదములను శుద్ధోదకముతో ప)

క్షాళనముజేసి, జలమును శిరముపై జల్లుకొని, లేచి, లనుదర్శ నమువలన మా భవనమెంతయు బావనమైనది. మాకు భగ వంతుఁడేదో సౌఖ్యమును జేకూర్చుటకై మిమ్మిచటికి బంపి యుండెనని దలంచుచున్నాను. యోగి భీమపాలుని జూచి మీ వంటి నృపాలురు మావంటి వారల యాశీర్వచనములకు బా త్రులగుదురు. ఇచటికి వచ్చియుంటిని. నీవేదో యోచనాభావ మున నిమిడియున్నటుల దోచెడిని, నన్నేదేని బ్రశ్నింపగుతూ హాలుండవై యున్నచోఁ భగవంతుని యాజ్ఞవలన ప్రత్యుత్తర మిచ్చుటకు సమ్మతింతును. భీమపాలుఁడా యోగీశ్వరుని బలు కుల నాలకించి 'నేను మిగుల క్రూరుఁడను, పాపపుంజమును, నా బాపములన్నియు నాజుట్టును గ్రహములై సంచరించు చు న్నవి. పాపభీతిచేఁ పాపకార్యముల జేయుటకు భీతినొందు చుం దునేగాని, నా పూర్వజన్మ ఫలముననో, యేకారణముననో, పాపము నన్ను వెంటాడి దిరుగుచున్నది. మావంటి పాపులపై పరాత్పరుని కరుణ గలుగ మాజన్మములు తరించునా? 'అపు త్రస్య గతిర్నాస్తి' యనునటుల పుత్రహీనుఁడైన నాకు గతు లుండునా? నాకేదేని పుణ్యమార్గోప దేశకయగు మంత్రోప దేశమును జేయుదురా? 'ఆర్యా! నీవట్లు చింతింపవలదు. నీకు సుపుత్రోదయము కాఁగలదు. ఈ మాఘశుద్ధ ఏకాదశినాడు మీ రిరువురును పరమేశ్వరుని గూర్చి వ్రతమాచరింపుడు. ఈ ఫలమును, నీజ్యేష్టభార్య మోహిని కిమ్ము. సుతోదయముకా

గలదు. రోహానుడని నామకరణం బొనర్పుడు. పరాత్పరుని భజింపుడు. అనుచు భీమపాల మోహినుల నాశీర్వదించి చనెను. యోగి చనినంతనే సంతోషముతో మోహిని భీమపాలుని యొద్దకేగి, నేడెంతయో సుదినము. యోగిపుంగవుం డిచటికి వచ్చి మనకిట్టి వార్తను జెప్పుటఁజూడ, యోగిపుంగవుడే భగవంతుడై యుండవచ్చునని నమ్మకము. మనమా పరాత్పరుని భజించుట మేలు. శుభవార్త మనకు ధయిర్యమును గలుగజేయును

—o—

## రెండవ ప్రకరణము.

—o—

### వేట

ఆహా! పరమేశ్వరున కెంత యసూయగలదు! అతిసుకుమారియగు కాంతకు వృద్ధుని భర్తగాఁ జేయుచుండెను. సుందరునకును, యౌవ్వనునకును ననాకారియగు కాంతను భార్యగా చేయుచున్నాడు. లేబ్రాయమున వైధవ్యము నొసంగుచున్నాడు. సంపత్సముద్రము గలవానిని పేదగా జేయుచుండెను. సకలయిశ్వర్యములఁ దూగువానిని నిస్సంతుగా చేయుచున్నాడు. ఇటుల సృష్టించనేల! బాధింపనేల! ఎల్లపుడును వల్లభుని యుల్లంబునకు సంతసంబుఁ జేకూర్చి మెలంగని కులాంగనయు కులాంగన యంతరంగ మెరింగి మెలఁగని వరుండును, మిగుల యనర్థకంబులేగద! భగవత్సృష్టియం దెంతలోపమున్నది. క

ట్టా! యీ చక్రవర్తి యెల్లప్పుడును నారాజ్యము నాప్రజలని కల వరించుచుండెనేగాని, భార్యయం దిసుమంతయైన ప్రేమాతిశ యముల జూపునటుల దోచదు. మోహిని నిందు గూర్పనేల? ఆపెయం దనురాగము గలిగియుండె నేమోగాని నాయందుమా త్రమది సూన్యము. ప్రపంచమున ప్రజానుకూలముగ రాజ్య ము నేలిన రాజపుంగవులు లేరా! వారు తమసతుల సంతసింప జేయుట లేద! పురుషునకుఁ దరుణిపై సహజానురాగము గలిగి యుండవలయునేగాని, నన్ను ప్రేమింపుము, నన్నేలుకొనుము అని యన్నంత మాత్రముననే ప్రేమింతురా? తొలుత మజ్జన కుండు నన్నితఁడు పూలుటూయల గూర్చుండబెట్టి లాలించునని తలంచి యితని పిల్చి బరిణయంబుసేసె. పూజార్చనములేని శిలావిగ్రహమునై, మెరుంగులేని యలంకారమునై, రాజులేని రాజ్యమునై యుంటిని. కట్టా! నన్నేలాడిదైన యంగనామణి కెన్నివైభవము లుండినను, మన్నించు నాథుండు లేకున్న య వన్నియు బూడిదలోబోసిన పన్నీరగునుగద! భర్తృసౌఖ్యంబె రుంగని జవ్వనికన్న బ్రయోజనహీనంబగు వస్తువొండులేదు. దైవమా! నాకెట్టి దాంపత్యమును గూర్చితివి? నాకీ జవ్వనం బెందులకు? పంకజనయన తనయా! రక్షింపుము రక్షింపుము నీవాడికోలల నాటి నన్ను బాధింపకుము. నీలమేఘశ్యామా! రావణా! నేనెటులీ కామాంధకారమును దాటగలను. మదనసా ర్వభౌమా! నీయిక్కట్టుల నన్నిటిని భరించుచుండ నన్నేలవా

టి మాటికి బాధించెదవు? ఈ యబలపై నీ వాడిశరముల సంధింపకుము. నిట్టూర్పుతోఁ నేడీతేఁ డడనికి వేటకై పోవునని దెలియవచ్చినది. నా మనోధనాప హారియగు జగత్సింహుఁడు వేటకు బయనముగానటుల దోచుచున్నది. రాజిలు వెడలినంతో డనే నేయుపాయంబుననో నా వలపుగాని రావించి నా చాతుర్యమున వలపు గలిగించి నాకోర్కె నీడేర్చు గొందునుగాక. నా చిన్ననాటనే నా హృదయము జగత్సింహుని హృదయమున నైక్యమైనది. నాతండ్రి భయంబుచే నన్ను భూపతికిడి వివాహముచేసెను నన్ను నృపతి యొక కంటనైనఁ జూడక యిట్టి యిడుమల బాలుసేయుట న్యాయమనవచ్చునా? ఎట్టి యిడుమల బొందినను యీ తేనితోఁ గాపురముసేయుట కడు దుర్లభము. ఆ పనికిమాలిన మోహిని గుక్కయై దోసె లొగ్గుచున్నదిగాని నేనటుల చేయగలనా? ప్రభావతి అత్యాతురతతో లోనికివచ్చి 'అమ్మా! భీమపాల మహారాజుగారు మన యంతఃపురమునకు వచ్చుచున్నారు' అని చెప్పఁ యోచనాతత్పరయైయున్న నళిని ఆశ్చర్యముతో కాలవిపరీతముగనున్నదే. భీమపాల మహారాజుగారు నేడేలకో, మన మందిరమునకు వచ్చుచుండిరి. నీవతి త్వరితగతిఁబోయి శయనమందిరమును నలంకరింపుము' అని చెప్పెను.

భీమపాలుఁడు రథమును దిగి లోనికి బ్రవేశించి మహారత్నగిరి సామ్రాజ్యాధిపుని వలపులరాణికిఁ గల్యాణమేఘధయై

ని ప్రశ్నింప నళిని నమస్కరించి నాకు గుశలమే. మీా ముద్దు
లమోహినికిని మీాకును గళ్యాణమేగద? 'ప్రియసీ! మాకు గు
శలమేగాని, మోహినియానీవా నాముద్దుల రాణివి?' అని ప్ర
శ్నించెను. నళిని నవ్వుచు "మీాకుఁ దెలియని విషయమొకటి
యుండునా! అందరును ముద్దులరాణులే!' నాఁటినుండియు రా
జ్యపాలనమున గొన్ని కష్టములు వాటిల్లఁ వాటి నన్నిటని సవ
రించి, నాముద్దుల మోహనాంగివగు నిన్ను జూడవచ్చితిని'
'మిమ్ముల నిచటికి రావలసినదిగా యెవరు ప్రార్థించిరి?' 'ము
ద్దులొలుకు, బలుకులఁ బలుకు మోహనాంగుల పైనుండు ప్రే
మాతిశయములే నన్నిటకుఁ దోడ్కొనివచ్చినవి' 'ఇప్పటికైన
ను నన్ను క్రీగంట జూచుట తటస్థించినది. అంతియె జాలు.
ఈకాంత నేడేలకో ముకుళిత హృదయయై బలుకుచున్నది. ఈ
మె పలుకులు నా హృదయమున ములుకులకన్న జురుకులై నా
టుకొనుచున్నవి. గొన్ని యూరడింపు బలుకుల బలికి యీామె
కు సంతోషమును గరపువాడను అని తలంచి, "దేవీ! నేడిటు
లేల గోపితవై బలుకుచుంటివి తొలుత నీయలుకకు కారణం
బెరింగించి నన్ను దూషించిన దూషింపుము. అటులనుట నాం
కంగీకారమే' యని బలుక 'ఓహో! ఎంతమాట బలికిరి! దిన
దిన ప్రవర్ధితాను రాగులగు మీారు నా కలుక గలిగింతురా?'
'కాంతా! కాంతలెప్పుడు తమ భర్తలు, తమవద్ద బెంపుడుఁ
గుక్కలై సంచరింప వలసినదని తలంతురుగాని రాజ్యాంగభార

ముగల నా వంటివాని కటుల సాగదు’ మీరు యిట్టి యుక్తి వచనముల బలుకుదురని నేనెరుంగుదును’ కాంతా! నీతో నబద్ధము లాడుదుననుకొంటివా?’ అనుభవముపై నేనొక యదార్థమును జెప్పెదనువినుము. నే నేమాత్రమును ధంభములఁ పలికె మోసగించువాడనుగాను. నాపై రాజ్యభార మున్నయప్పుడు న్యాయముగ, సుభిక్షముగ నేలి ప్రజానురాగమును బడయవలయును.’ ఆర్యా! తామెల్లప్పు డిటులే బలుకుచుండిరి. నే నమ్మజాలను. వేయేల, మీ రాజ్యభారమును మీమంత్రి సామంతాదులకేల యొప్పగింపగూడదు?’ ‘సరి సరి! మంచియుపాయములనే జెప్పితివే! రాజ్యభారము నంతను మంత్రిసామంతాదులకు విడచి, కీలుబొమ్మనై మెలఁగ వలసినదనియేనా నీ యుద్దేశ్యము. అటులైనచోఁ రాజేల? రాజ్యమేల; నీకీ రాణిపదవిగూడ నిరసింప, సామాన్యకాంతవై మెలగవలసినదే.’ వచ్చినవా రెటులయిన వచ్చిరి. ఘటియకాల మిచటఁ శాంతముగ విశ్రమింపుడు. అయ్యో! మరచితిని. నేనిచ్చోటికేతెంచిన కార్యమొండు, జేయుచున్నది యొండు! కాంతా! నాకొరకై యోధువరులెల్ల వేచియుందురు. నే పోవుచున్నాను’ అని రథముపై గూర్చుండి తన భవనమునకు చనియెను.

ఈ నృపాలుఁడు నటనా నాటక రంగస్థల పాత్రధారియై సంచరించుచు, యోగిపుంగవుఁడు తన మోద్భవ విషయమును జెప్పెఁదాదగ మోహినీ ప్రేమబంధములకు లోనై, ఆల

యముననుండిన విగ్రహమును జూచుచుండెను. పూరక వచ్చుచు జూచి పోవుచుండెను. పోనిండు. గ్రహమువలె బట్టి బీడించుచుండిన పిశాచము పోయినది. నామదన సార్వభౌముఁడగు జగత్సింహునితోఁ జెలిమి జేసుకొని సుఖించుట కిదియ సమయము.

—o—

## మూఁడవ ప్రకరణము.

..o—

### క్రూరకృత్యము.

వాయువేగముగ బరుగెత్తు వారువము లలంకరింపబడెను. భోజనాది సామగ్రులన్నియు, శకటములపై యుంచబడెను. వీరవర్గ యోధులెల్లరు వేటయందు తమ నైపుణ్యమును జూప గుతూహలురై వారువములపై గూర్చుండి యుండిరి. అంత సాహిణి యొకఁడు అశ్వాలయమునకు బోయి, మేఘమండలోదకంబుల దేనోపు జవసత్వములు గల ధవళాశ్వము నొకదానిని దీసికొనివచ్చి, మోమున ముదమొప్ప చక్కని మోముట్టి నమర్చెను. అయ్యది వజ్ర, వైఢూర్య, గోమేధిక, మరకత, మాణిక్య, పద్మరాగ, ప్రవాళ, నీల, పుష్యరాగములచె దయారుచేయబడెను. దాని మేన హేమచ్ఛాయగ ప్రకాశించుచున్న ముకమలు జీను పరువఁబడి యుండెను. దాని సిరోభాగంబున మెరుగిడఁబడిన పికిలిపి చ్చ లమర్పబడియుం

డెను. ఇటు లమర్పఁబడి యలంకరించిన వారువమును రాజసౌధమువద్దకుఁ గొనివచ్చి, భీమపాలునియొద్దకుఁ బోయి, వారువమును దీసికొని వచ్చితిమని చెప్పెను. అంత భీమపాలుఁడు వేటకై పయనమై, వీరవర్గ యోధులతో గూడి అరణ్యమునకు బోయెను.

రాజు వేటకై చనిన వార్తను వినినంతనె హృదయ ముప్పొంగ ప్రభావతిని బిలచి 'నీవు నా యంతఃపురముననే యుండుము. నేఁటినుండి మన ప్రయత్నములు జయప్రదముగ జరుగవలెను. ఇఁక నీ ప్రయత్నముపైనుండి కార్యమును సమకూర్పుము.' ప్రభావతి రాణివద్దకు వచ్చి నిలచి చేతులుజోడించి తమ యాజ్ఞానుసారముగ నేను మీకు సహాయ మొనర్చెదనని చెప్పెను.

సాయం సమయమున ప్రభావతి రాణివద్ద శెలవుగైకొని జగత్సింహుని గృహోన్ముఖురాలయ్యెను జగత్సింహుఁడు సైన్యమునుండి వచ్చి ఫలహారము గైకొని తూఁగుటూయలలో గూర్చొనియుండెను. ప్రభావతి వానికి నమస్కరించి 'ప్రభూ! నళినిరాణిగారు నిన్నటినుండియు జ్వరపీడితయై యున్నది. తమ్మొక్కతూరి ఆమె మందిరమునకు రావలసినదిగా కోరినదని చెప్పఁ యులికిపడి! 'ఏమీ' మన రాణిగారు అశ్వస్థతయై యున్నదా! యీమాట ప్రథమముననే చెప్పినచో త్వరితముగ వచ్చియుందునే? ఎంతటి యవివేకివి! జాగేలచేసితివి! ఈ యు

దయముననే నావద్దకు వచ్చియుండినచోఁ నేనచ్చియుందునే! లే లెమ్ము. పోవుదమని తనలో హృదయమా! నీవు యొరులకు అమ్మఁబడితివి. ఎన్నికష్టములు వాటిల్లినను యనుభవింపక దీరునా! ధైర్యము వహింపుము. మేలైనను, కీడైనను, ఆ వైకుంఠేశునిదే భారము. నీ అధికారుల ఆజ్ఞలను శిరసా వహింపవలెనుగదా! గావున నీ తత్తరమును మానుము. అని తలంచుచు లోనికి బోయి భార్యయగు సుశీలతో యీ వార్తను చెప్పి ప్రభావతి వెంటఁ చనెను. స్త్రీ అంతఃపురములోనికి జొచ్చుటకు సంశయము వొడమ కొంతతడవు ద్వారకుండి నళిని అంతఃపురములోనికి బొచ్చెను. ప్రభావతి అతనికొక ఆసనమును సిద్ధపరుప, జగత్సింహుడు నళినికి నమస్కరించి, దానిపై గూర్చుండెను. ప్రభావతివలన తమ యస్వస్థతా విషయమును విన్నదాదిగ నా హృదయమున నేదియో యొక బాధ గలుగుచున్నది. అని పలుక, నళిని కండ్ల నులుముచు, మిక్కిలి దేహాపీడనము గలదానివలె యొడలు విరచుకొనుచు, 'జగత్సింహా! నే జ్వర పీడితనై యున్నాను. నాకేదేని యౌషధమును వైద్యునొద్దఁ బుచ్చుకొని వెళ్లి అరుణోదయముననే నాకనుపుము. రేపు యీ వేళకే నా యంతఃపురమునకు వచ్చి నా స్థితిగతులను గనుంగొని పొమ్ము.' 'తల్లీ! మీ యాజ్ఞను శిరసా వహించెదను. ఔషధమును నా పరిచారికకు యిచ్చి బంపెదను. అద్దాని సేవించి ఆరోగ్యవంతులు గండు. ప్రొద్దుగ్రుంకి చాలకాలమైన

ది. నాకు శెలవిత్తురా' యని కుర్చీలోనుండి లేచెను.

ఆహా! యితని రూపమేమి! ననమన్మథునివలెఁ బ్ర కాసించు దేహునితో సుఖించినవారికే సౌఖ్యము. ఈతని బ లుకు లమృతబిందువులై, బలుకునంత కాలము నా హృదయ ము నుప్పొంగ జేయుచున్నవి. అని మదిలోతలంచుచు జగత్సిం హుని జూచి 'ఆర్యా! నీవు నా చిన్ననాటి మిత్రుఁడవని యెం చి నిన్నిటకు రావించితిని గనుక మరియొక విధముగ నుద్దేశిం ప వద్దు అని బలుకుచు నిజముగా దేహారోగ్యత లేనిదానివలె పరుండెను. జగత్సింహుండు నళినివద్ద శెలవుగైకొని వైద్యునిం టికి జని, రాణియొక్క రుగ్మతను దెలిపి ఔషధముల దీసుకొ ని, స్వగృహోన్ముఖుం డయ్యెను. జగత్సింహుఁడు భుజించి వి శ్రాంతిఁగైకొనుటకు బోయెను. అరుణోదయాత్పూర్వమె తన పరిచారికకా యౌషధముల, నిచ్చి నళిని మందిరమునకు బంపె ను. నళిని ఆ యౌషధముల సేవించుదానివలె నటించెను.

నాఁటి సాయంకాలమున జగత్సింహుఁడు చక్రవర్తిని యాజ్ఞప్రకారము నళిని మందిరమునకు జని గావలివాండ్రవలన రాణి దేహస్థితిని గూర్చి ప్రశ్నించి లోనికిపోయి, బరుండియు న్న నళినికి నమస్కరించెను. నళిని వాని బలుకులవిని దిగ్గునఁలే చి బరిచారికను బిలచి యాతనికొక ఆసనమును గూర్చవలసి నదని ఆజ్ఞయిచ్చెను. జగత్సింహుఁడా యుచితాసనముపైఁగూ ర్చుండి ఆమెకు శరీరారోగ్య మెటులున్నదో యని ప్రశ్నింపఁ

నళిని గతదినమునకన్న ఆరోగ్యముగనె యున్నటులను, ఔషధ మును రేపుగూడ బంపవలసినదని చెప్పెను. జగత్సింగామె యిచ్చవచ్చినటులే చేసెదనని చెప్పఁ నళిని యొక్క నిట్టూర్పుతో, ఆర్యా! నాకీ రాజ్యమేల, భోజేల! భగవంతుఁడు నన్నెన్ని యిక్కట్టుల బెట్టునో నాకేమియుఁ దెలియుటలేదు. నామనం బేలకో వ్యాకులతఁ జెందుచున్నది. కారణమును దెలుపఁ జాలను. అంతఁ జగత్సింహుఁడు, ఏదియో యోచించి అమ్మా! మీ రాజదంపతుల క్షేమము గోరువారును, మీదేహారోగ్యము చెడినచోఁ ధన్వంతిరి నిటకుఁ రప్పించువాఁడను. ఆజ్ఞ నిచ్చెదరాయన నళిని ముకుళిత హృదయయై, నా రుగ్మత నన్నుగోల్పోవునేమో! నాకు గోచరముగుట లేదు. కాలుఁడు నాపైఁకాలపాశమును వేయుచున్నాఁడు. నేఁటితో నాజన్మ మంతరింపనై యున్నదనుచు వికటచేష్టలచే నటునిటు దలయూపి జగత్సింహా! ఎల్లి అరుణోదయము గాకపూర్వమె నీవిచటికి వచ్చినతరువాత నీ యుద్యోగమునకు బోవచ్చునని చెప్ప ఖిన్నుఁడై జగత్సింహుఁ డామెవద్ద శలవుగైకొని తననిజసదనమునకు జేరి, శయ్యాగృహమున నున్న వేదికపైఁ గూర్చుండి యీ చక్రవర్తిని యిటులఁ బలికినది. నాకేదేని అపకారమును జేయదుగద! భీమపాలుఁడు రత్నగిరినివిడచి వేటకై బోయియుండ, ఆమె కోరిన వేళకు, ఆమె యంతిపురగమునకు బోవుటయె నాగొప్ప యపరాధము, నాకు కీడేసంభవించునేమొ అయ్యో! పొరఁబడుచున్నా

ను! రాజాజ్ఞను మీరవలదుగద. ఇట్టి కార్యమువల్ల నేరమున్న ట్టుల దోచదుగాని యెట్టులయినను అపరాత్పరుఁడే నా శరణ్యము. నన్ను గాచువాడా శౌరియేయని నిద్రించెను.

—o—

## నాలుగవ ప్రకరణము.

—o—

### తప్పెవరిది.

మరుచటి యుదయముననే లేచి కాలోచిత కర్మముల నాచరించి వీరవర్గయోధ దుస్తుల నలంకరించుకొని జగత్సింహుడు నళినీ సౌధమునకుఁ జనెను. గావలియున్న దాసివలన తన రాకఁ నెఱింగింపఁ రాణి వానిని లోనికి రావలసినదని ఆజ్ఞయిచ్చెను. జగత్సింహుఁడు లోనికిఁ బోయి ఆ యన్నులమిన్నకు నమస్కరింపఁ ఆమె నతని నొకసోఫాపై గూర్చుండవలసినదని చెప్పెను. వీరవర్గ యోధుండా సోఫాపై గూర్చొని తమ ఆరోగ్య మెటులున్నది, ఔషధములనింకను దెప్పింప మందురాయని ప్రశ్నింప, నళిని నిమీలిత లోచనియై, ఆర్యా! నీతో నాపూర్వ వృత్తాంతమును ముచ్చడింపఁ గుతూహలాయత్త చిత్తనై యుంటిని. జెప్పమందువాయని ప్రశ్నింపఁ జగత్సింహుడు దలయూచి, నాతోఁ ముచ్చటింపవలెనను గుతూహలురై యున్నచోఁ అటులే గానిండు అని జవాబిచ్చెను. అంత నమ్ముగ్ధజయాన వికసిత హృదయయై మిత్రమా! బాలషా

యమున మనమిరువురము బాలశాలయందు విద్య నభ్యసించు నపుడు, మజ్జనకుఁడు నీ సౌందర్యాతి శయంబుల గని, నన్ను నీకిడి పాణిగ్రహణ మొనర్పఁ దలంచుచు, నా వద్దనప్పుడు నీ సౌందర్యాతి శయములను, సుగుణ గణమును గూర్చి ముచ్చ డించు చుండెడివాడు. నీ మన్మథ లావణ్యమును, నీ వినయవి ధేయతఁ గాంచినంతనె నాకును నీయందె అభిలాష యుండెడి ది. ఈ మహారాజు గారియొక్క ఆజ్ఞ నుల్లంఘింపఁ వలసివచ్చె నేమొ యని దలఁచి నన్నితేనికిచ్చి బరిణయంబుసేసె. అటు ల య్యును నా సౌఖ్యమున కెట్టి అంతరాయములును గలుగుట లేదుగాని .— * * * * *

నాఁటినుండియు నా మనము నీ మనముతో లీనమైనది. నేనీ రాజుతోఁ గాపురము చేయలేను. ఈ వృద్ధపతివలన నాకు సౌఖ్యము సున్న. నీవే నాదిక్కు. నీపాదసేవ చేయుటకు సం సిద్ధురాలనై యున్నాను. కావున నన్ను కాచి రక్షింపుము. ఇదియె నా ప్రార్థన. స్త్రీల ప్రార్థనల నాలించుటయె పురుషు ల కర్తవ్యమై యున్నది.

కర్ణకఠోరంబులగు పలుకుల వినినంతనె జగత్సింహుని హృదయము తత్తరమొంద చెవులు మూసుకొని హరిహరా! ఎంతపాప మెంతపాపము. పరమేశ్వరా! నాయూహా కనుకూలు డవై యుంటివా! నాకెందుల కిట్టి సౌందర్యము నిచ్చితివి? పురుషులకు సౌందర్యముతోఁ బనియేల? నే నేకపత్నీ వ్రతస్థు

డ నెవ్వోగాదోయని బరిశీలింపc యిటు లొనర్చుచుంటివి గా బోలు. అంతయు నీదే భారమై యున్నది. ఈ పేదభక్తుcడైన జగత్సింహునిc గాపాడుము. నేను యీ అంగనామణి యురిలో దగుల్కొంటిని. ఎటులయినను, జతురోపాయముల నీమెకు బుద్ధిగరపు వాడనని దలcచుచు, అమ్మా! సకలశాస్త్ర పారీణు రాలవగు నీవు—బాపపుణ్యములన దెలిసిన నీవు—యిట్టి యుద్యమమునకుc బాల్పడుచుంటివా? నీకిది తగదు. ఈయుద్దేశ్యమును మానుము. సద్వర్తనము గలదానవు గమ్ము. నన్ను రక్షింపుము. నా ప్రార్థనల నాలకింపుము. అని ప్రార్థించెను. వానిమాటల బాటింపక 'ఓయీ! నీ పలుకులు నా హృదయమున ములుకులకన్న జురుకులై నాటుకొనుచున్నవి. నీ కంటె ప్రాజ్ఞుండును, ధయిర్య స్థయిర్య బల పరాక్రముండును, నవ మన్మథ సౌందర్యాతి శయములు గలవాడును, యెవరునులేరు. నీవే నా మనోధనా పహారివి. నన్ను చేపట్టుము. నీకు మేలొనర్చెదను. జగత్సింహుcడు లేచి అమ్మా! సకల యీప్సితార్థముల దీర్చు పతిcయుండcగ నీకిట్టి యుద్దేశ్యము తగదు'—ఉండిన ప్రయోజనమేమి? మీ పతివలన నేనెట్టి సౌఖ్యమును బొందియుండలేదు. మనోవాంఛల దీర్పని వరుం డుండినను లేనట్టులై భావము నా యంతరంగ మెరింగి చరింపని నాథునితో నాకెట్టిసౌఖ్యము చేకూరును?'—'అగ్ని సాక్షిగ బెండ్లియాడిన పురుషుcడు గుడ్డివాడైనను, కుంటివాడైనను, పిరుపేదవాడైనను, కులాం

గనలకుఁ బూజనీయుఁడేగద—కోరి ప్రాకులాడుచుండు అంగనామణి వాంఛ దీర్చుట బురుషుని ధర్మమేగద—దీనురాలనై పలుమారులు బ్రతిమాలు చుండునట్టిదాని నీవు విసర్జించుట నీకు న్యాయమా? అల్పులమైన మావంటి స్త్రీలచే నీ విటుల పలుమారులు బ్రతిమాలించు కొనవచ్చునా? ఆలసింపక నా కోరిక నీడేర్ప ననుఁ గవయుము. కాలహరణముచే నా మనోదవానలము ప్రజ్వలించు చున్నది వేవేగ నీబుద్ధిని మఱల్చుకొని అట్టి అగ్నిని జగల్చార్పుము'.—'ఓ రాణీ! నీవిట్టి దుర్వృత్తి గలదానవని వినియున్న చోఁ నీ సౌధమునకు వచ్చియేయుండను. చిన్ననాఁట నుండియు నీపై నాకు కోరికగలదు. అని వచించుటకు నీనో రెట్లాడెను. మీ ధనముచేఁ మీ చేతుల యందు బెరుగుచు సేవచేయుచున్న సేవకులను కోర నీ మనం బేల సంతసించెను? నన్ను హింసింపక రక్షింపుము. లేదేని, ఇదిగో నా కరవాలమున ప్రాణముల గోల్పోవు చున్నానని యొరనుండి కత్తిని దీసి కంఠముపై బెట్టుకొన బోవుచుండఁ శయ్యపై గూర్చుండిన నళిని దిగ్గున దుమికి కరవాలమును బట్టుకొని, ఆర్యా! స్త్రీలకుగాని, పురుషులకుగాని, యొండొరులపై సహజానురాగ ముండినచోఁ నిన్ను నే నేల బ్రతిమాలుదును నీయందే లగ్నమై యున్నదని వచించు స్త్రీ యొక్క ప్రార్థనల నాలకించి ప్రాణముల బాయవలెనన్న బాయుము. సాహసింపవలదు'—'స్త్రీలు దుర్మార్గప్రవృత్తికి సాహసింపవచ్చు

నా?'—నా ప్రార్థనల నాలింపక, నిర్హేతుకముగ జగత్సింహుఁ డేల ప్రాణముల బాయవలెను. మనోవాంఛ దీరక, కుటిలబుద్ధి గలదాననై యుండినచోఁ నా ప్రాణము లెప్పుడైనను నన్ను బాయగలవు. గావున నేనే హత్య చేసికొందును. అని తలచి శయ్యాతలమువద్దకు బోయి, కరవాలమును దీసి చేతఁబూని * * * ఛీ! యింతలో త్వరపడనేల! కఠినోపాయంబును బ్రయోగించి చూచెదననుచు, కరవాలమును బైకెత్తి 'ఓ ఖడ్గరాజమా! ఎందులకు యిట్టి దౌర్భాగ్యురాలి నీ పుడమిపై నుంచితివి? ఈ మెరుగల మిత్రులెల్ల శత్రులయిరి. నీవి జన్మ నాంగమును గోలుపొమ్ము. ఈ దుర్మార్గురాలు పుడమిపై నిక బ్రతుక నాహసింప దనుచు కంఠంబున బొడుచుకొనబోయెను. తన చేతియందున్న కరవాలమును యొరలోనునిచి, నళిని కరంబుననున్న ఖడ్గమును గట్టిగ బట్టుకొని, తల్లీ! ఇట్టి దుష్కార్యము నేలజేసెదవు? మనో చాంచల్యమును బారద్రోలి యిహలోక సౌఖ్యమును బొందుము. ఇట్టి దుష్కృత్యములు చేయుచోఁ నేనిచ్చోట నుండజాలను. పాపభీతి గలిగి యుండుమని రెండుమూడ డుగుల వేయ నళిని దవ్వున యాతని కరమును బట్టుకొని, నా యంతఃపురము నుండి బోఁజాలవు. కావున నా ప్రార్థనల నాలకింపుము. స్త్రీహత్యా పాపమునకు యొడిగట్టుకొనకుము జగత్సింగా మెలోఁ అమ్మా! నే నేఁకుఁ బోవలెను. రాజాజ్ఞ నుల్లంఘించినవాడ నగుచున్నాను. నేనిట్టి దుష్కృత్య

ములకు మొడిగట్టు కొనువాఁడను గాను. పేదసేవకుఁడైన యీ దీనుని రక్షింపుము అని ఆమె వద్దనుండి కదలిపోనఁ అతని గాఢముగ బట్టుకొని ముద్దిడబోయి, అంతనుభార్యామె దయారు చేయఁబడి శయ్యాతలమున నున్న పూలదండ నొకదానియా తని మెడలో నలంకరింపఁబోవ యాతఁడు దానిని విసర్జించెను. నళిని అతని రెండుచేతులఁ గట్టిగ బట్టుకొని, మరల పూలదం డను మెడలోఁ వేయుచుండఁ జగత్సింహుఁడు దానిని విసర్జించి నీతి వచనములఁ హితోపదేశము చేయుచుండెను. నళిని వా ని నీతివచనంబులఁ బాటింపక పూలదండను చేతఁబూని ముద్దిడ బోవుచుండెను.

—o—

ఐదవ ప్రకరణము.

—o—

వియోగము.

పదకొండుఘంటల కాలమయ్యెను. వేటకుఁ బోయిన భీమపాలుఁడు వేటనుచాలించి రత్నగిరికి చేరె విశ్రాంతి గైకొ నుటకై నళిని భవనమునకు వచ్చెను. ఏలికను అడ్డగించి దెచ్చు వారుందురా? స్త్రీల యంతఃపురములకు బోవుటకు భర్తయై నను భార్య ఆజ్ఞను పొందవలెనుగదా, ఎట్లులీ రాజు నళినీ సౌ ధములోనికి జొచ్చెను అను సందేహ ముదయించ వచ్చును. నియమింపబడిన కొంతకాల ముండును. అట్టి వేళలయందు స్త్రీ

తంత్రింపరాదు; ఎవరి ఆదరణవలనఁ బోషింపఁ బడుచుండిరో, అట్టివానిని అడ్డుచేయుట కష్టము. భీమపాలుఁడు నళిని శయన మందిరమునకుఁ బోయెను. నళిని పూమాలను చేతబూని జగత్సింహునకు ముద్దిడబోవుట చూచెను. జగత్సింహుఁ డామెచేయు గ్రీడల నన్నిటిని విసర్జించుచు జేతుల నడ్డుపెట్టి యుండుటచేతను, నళిని హస్తము జగత్సింహుని భుజముపై నుండుట చేతను, జగత్సింహుఁడే రాణిని చేబట్ట దలఁచెనో యన్నటు లుండెను. భీమపాలుని జూచినంతనె జగత్సింహుఁడు నిశ్చేష్టుఁడై నిలచియుండెను. నళిని కంటఁ నీరుకార్చుచు, భూపాలుని కాళ్ళపైఁబడి పాదములను మూర్కొనెను. రాజు ఆమెను లేవదీసి వృత్తాంతము నంతను అడుగ 'జగత్సింహుఁడు రెండుదినములు యేదియో ఒంకబెట్టి నా మందిరమునకు వచ్చెను. కారణము లేకయే తమ రిప్పురమున లేని సమయమున, నా పురమున కేలవచ్చితివని ప్రశ్నించితిని. అతఁడు నాకు సరియగు సమాధానము నీయకయే జనుచుండెను. నా పరిచారిక యగు ప్రభావతిని జగత్సింహుని మన అంతఃపురముల కేల రానిచ్చెదరని దండించితిని. ప్రభావతి నేఁటినుండి అంతిపురములోనికి జొరఁబడ నీయదు. అని చెప్పి యీ యుదయమున ద్వారము వద్దఁ వేచియుండ, దానిని మోది లోనికిఁ జొచ్చెను. నా శయనమందిరమున శయ్యపై బరుండియుండఁ లోనికి జొచ్చి— నన్ను వాంఛింపుము— అని పూదండను నా మెడలో వేయు

బోవుచుండెను. నేను దానిని వాని వద్దనుండి బలవంతముగ గై కొంటిని' అనిచెప్పి కండ్లనీరు కాలువలై పారునటులదుఃఖించెను

ఆహా! ఏమి అద్భుతము! చిన్ననాఁట నుండియు,నిన్నే ప్రేమించితిని, నీయందే నాకు అభిలాష గలదు, నీవు నన్ను చేఁబట్టి నా మన్మథ దావానలమును జల్లార్పుము, నాపొందు గోరి సుఖ మనుభవింపుము, అని వికటచేష్టలచే నన్నెంతో బాధించిన యికాంతామణి యెట్లుల వచించినదో జూచిరా? స్త్రీ హృదయము కడు కోమలమని పెద్దలు వచింపుచుందురు. ఇది యెగాబోలు కోమలత్వము.

శ్లో॥ ఆత్మబుద్ధిః సుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః
పరబుద్ధి ర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయాంతకా.

చూపులకు కోమలమేగాని తాకులకు నల్లరాతి బండయే. స్త్రీ హృదయాంత ర్భాగమును గొలువగలరా?

చం॥ అతివలజూచి పీ రబలలంచు వచించు మహాకవీంద్రులు
ద్ధత విపరీతవాములిది దబ్బఱగాదు విలాసినీ సమం
చిత తరళాక్షి పాతములచే గెలువంబడి రింద్రముఖ్యులు
ధృతినటువంటివా రబలలేగతినైరి తలంచిచూడగన్.

(భ. సు. స్కం. శ. 10)

పక్షివాహనుండైన పరాత్పరుండే లొంగియుండె. నన్నయభట్టారకాది విద్వన్మణులఁ బోషించిన. రాజనరేంద్రుఁడు భార్యపలుకుల నాలకించి న్యాయా న్యాయముల గుర్తింపక

సుబుద్ధియగు సారంగధరుని చిత్రవధ సేయించె. నేడీ భీమపా
ల మహారాజా? భగవంతుండు నిర్దయుండై, నాపై తన కరు
ణాకటాక్ష వీక్షణముల నిట్లు ప్రసరింపఁ జేసెనాయనుచు మనో
దుఃఖితుండై జగత్సింహుండు అపరాధివలె నిలచియుండెను.

కులటయగు నళిని పలుకుల నాలకించి, కోపోద్దీపితమా
నసుండై "ఓరీ తులువా! రాజద్రోహీ! ఎంత నీచకార్యమున
కవలంభించితివి? సద్వర్తనుండ వనియు, సుగుణుండ వనియు,
దలంచు చుంటినేగాని, యిట్టి దుర్మార్గుండవని నే కలనయినను
కని విని యెరుఁగను' అని చేతులుగట్టి నిలచియున్న జగత్సిం
హుని శిరమును దన్ని, నిన్ను నీ యుద్యోగమునుండి దొలఁ
గించి, జన్మాంతరము వరకు కారాగారశిక్ష విధించితినని సేవ
కులఁ బిలచి, జగత్సింహుని కారాగార బద్ధునిజేసి, జగత్సిం
హుని భార్యయగు సుశీలను అడవులకు దోడ్కొనిపోయి శిర
మును దీయుఁడని కఠినాజ్ఞ విధించెను. ఆహా! భీమపాల పరిపా
లనము! నిర్హేతుకముగ ఏపాప పుణ్యముల నెరుఁగని సుశీల శిర
మును దీయుఁడని కఠినాజ్ఞ విధింపనేల? ఇదియె సత్యపాలనము.
రాజాజ్ఞను శిరసావహించి వాని యుద్యోగ దుస్తులను విడిపించి
ఖైదీ యుడుపుల నిచ్చి శృంఖలాబద్ధునిచేసి, కారాగృహమున
బంధించిరి.

---

## ఆరవ ప్రకరణము.

---

### ఐశ్వర్యము.

సుశీలుఁడని కీర్తిగాంచిన, జగత్సింహుని యొక్క శిక్షణము, రత్నగిరియందంతను దెలియవచ్చెను. ప్రాతఃకాలము ననే సేవకుఁబోయిన భర్త రానందున యోచనా తత్పరయై కుర్చీలో గూర్చుండి యుండెను. సుమారు మద్యాహ్నము రెండుఘంటలు కావచ్చెను. భటుఁ డొకఁడు పరుగున జగత్సింహ సౌధమునకు వచ్చి, కండ్లఁ నీరుగార్చుచు, సుశీలవద్దకు బోయి మా వీరవర్గ యోధులగు జగత్సింహునికి భీమపాల మహారాజు గారు కారాగారశిక్ష విధించిరి. అని పలుక సుశీల నిశ్చేష్టురాలయి నిజ మారయగోరి మరల ప్రశ్నించెను. భటుఁడు ఆమెకు ప్రత్యుత్తర మీయలేక నిలచియుండెను. సుశీల దుఃఖించుచు గుర్రపుబండిపై, జగత్సింహుఁడు బంధింపఁబడిన కారాగారమునకు పోయెను. భార్యను జూచినంతనే జగత్సింహుని కండ్లనుండి దుమికిన నీరు వక్షో పరిభాగమును దడిపెను. సుశీలయు మిగుల దుఃఖించుచు, శిక్ష విధింపఁబడుటకు కారణమున్ను దెలుపవలసినదని కోరెను. జగత్సింహుఁడు గత మూఁడు దినముల నుండియు జరిగిన వృత్తాంతమును నాఁడు జరిగిన చర్యను జెప్పెను. సుశీల రాజశిక్షణ వార్తను వినినంతనే మూర్ఛనొందెను. పరిచారిక యొకతె శైత్యోపచారముల చేసి, ఆమె

ను జగత్సింహ మందిరమునకు అశ్వశకటముపై దీసుకొని వెళ్ళెను.

స్వగృహాగలుగ, భర్త దుర్మార్గవృత్తికి నలవడి యుండె నా, నళినియే యిట్టి దుర్మార్గవృత్తికి నలవడియుండెనా? ఎవరు నేరస్తులు, ఎవరు అల్పబుద్ధులు అని వితర్కించుకొనుచు, విధి కృతమును దాట నెవరికి శక్యమని దలంచి ఘోరముగ విలపింప దొడగెను. దినకరుఁడు హస్తమింపక పూర్వమే రాజసేవకులు జగత్సింహ భవనమును ముట్టడించి లోనికిఁజని ఆజ్ఞాపత్రమును సుశీలకుఁ జూపి, శృంఖల బంధించి, జగత్సింహ భవనమును కొల్లఁగొట్టి, ద్వారముల నన్నిటిని మూసి, తాళములువైచి, సుశీలను కారాగృహమునకుఁ దోడ్కొని పోయి, స్త్రీలకొరకు ప్రత్యేకముగ నిర్మింపబడిన కారాగృహమున బంధించిరి. నాటి రాత్రంతయు, భర్తకును తనకును గలిగిన వియోగమును గూర్చియు, న్యాయాన్యాయముల దెలసికొనక భీమపాలుఁడు విధించిన శిక్షను గూర్చియు విలపించుచు, నిద్రించెను.

మఱునాఁ డరుణోదయముననె యిరువురు భటులు ఖడ్గ పాణులై సుశీల బంధింపఁబడిన గదిని దెరచి, సుశీలను లేపి, అర ణ్యమునకు బయలుదేరిరి. సుశీల అప్పటికి అయిదవమాస గర్భ వతి. భటు లిరువంకల ఖడ్గపాణులయి ఘోరారణ్య మధ్యమునకు దోడ్కొనిపోయి అచటామెను తమ కరవాలములకు బలినొసం గ నుద్యుక్తులయిరిగాని, వారి మనంబేలకో గొంత యోచన

భావమున మునుఁగ గర్భవతియగు స్త్రీ హత్యాదోషమును బొందఁ బాపభీతులయి ఆమెకు నమస్కరించి, మేము సేనలోఁ బ్రవేసించినదాదిగ మమ్ము తమ పుత్రులకన్న నెక్కుడుగ ఆదరించిన మా జగత్సింహ వీరవర్గయోధుని భార్యలగు మీ శిరమును మహారాజుగారు విధించినరీతిని దీయఁజాలము. స్త్రీ హత్యాదోషమునకు మేము యొడిఁగట్టుకొనము. కావున మా పై నున్న వస్త్రముల నిచ్చెదము. యాకట్టు చీర నిచ్చి దాని భీమపాలునకు ఆనవాలుగఁ జూపెదము. మా ప్రార్థన నంగీరింపుడని ప్రార్థించి, తమపై నున్న వస్త్రముల నామె కిచ్చిరి. సుశీల "అయ్యలారా! నిరర్థకంబులగు జీవనములతో జీవించుటకన్న ప్రాణములఁ బాయుట మేలు. గావున నన్ను వధింపుడు" అని పలికెను. భటులు ఆమె పాదములపైఁబడి భీమపాలుఁడు విధించిన శిక్షకు విచారించి, తప్పక కట్టుచీర నీయవలసినదని ప్రార్థించిరి. సుశీల వారికి తాను ధరించిన చీరను, మఱి కొన్ని భూషణములను యిచ్చె. భటులామె నా యరణ్యమున విడచి, తామా స్త్రీని హత్య చేసితిమని దెలుపుటకుఁ గా బోలు, మార్గమధ్యమున కురఁగినము నొకదానిని జంపి చీరను రక్తమున దడిపి, కత్తులకు రక్తమును బూసి రత్నగిరికిఁ జని రక్తసిక్తంబులగు యానవాళ్ళను జూపిరి. తగిన శిక్షఁ విధించితినని భీమపాలుఁడు సంతోషించుచుండెను.

అడవులఁ బాలయిన సుశీల మిక్కిలి వగచుచు అయ్యో

రణ్యమున నేవ్యాఘ్రమునకో మేతయైనను సరియే యని ఎండ నక కొండనక బోవుచుండెను. ఆమెకు నిద్రాహారములు లేనందున మిక్కిలి బాధనొందుచు, నాటిరేయిం అంతయు నొక పొదరిటింట ఖిన్నురాలయి గడపెను. మరుచటి యుదయమున మిక్కిలి దౌర్బల్యముచేఁ లేవలేక, ఆచెట్టు నాచెట్టు నానుకొని దట్టమైన ఆకులుగల మార్గమునఁ బోయి, అచట మార్గము గానక ఒక పొదలోఁబడి పోయెను.

అయ్యడవియందు మాణిక్య చూడుఁడను కోయవాడు నివసించుచుండెను. అచటి కనతి దూరముననే అతఁడు తన గుడారములను వేసికొని అయ్యరణ్యమునందు పరివారముతో మృగములను వేటాఁడి విహారమును సల్పుచుండును. మాణిక్య చూడుఁడు మృగములఁ నేటాఁడు నాసక్తితోఁ యా ప్రాంతమున మృగంబేదేని దొరుకునా యను కుతూహలమున ఆయుధసమేతుఁడై అటునిటుఁ దిరుగుచు సుశీల బోవుచున్న మార్గమును జూచి, ఆమె పొదలోఁపడు సమయమున మృగమను యభిప్రాయమున వింటిని సంధించెను. భగవతానుగ్రహము దాటు టెరికిశక్యము! మాణిక్యచూడుండు సంధించిన శరము దుఃఖసాగరమున మునిఁగి మార్గము నుఁ గానక దుర్బలత్వ చేఁ బొదరింటఁబడిన ఆ కష్టజీవి కాలిపై నాటుకొనెను.

సుశీలకు బాణము తగులుటచే, ఆమె కండ్లనీరు గార్చుచు పెద్దపెట్టు అయ్యో! అబ్బా! యని రోదనము సేయుచుఁ బ్రా

రంభించెను. మాణిక్యచూడుఁ డత్యాశ్చర్యమున అయ్యది స్త్రీ యార్త నాదముగా నెంచి, బాణముపోయిన మార్గమున ఆ పొదవద్దకుఁ బోయెను. సుశీల కన్నీరు గార్చుచు మూలు గుచుండెను. మాణిక్యచూడుఁ డామెను లేవనెత్తి గూర్చుండ బెట్టి తనవద్దనున్న జలము నామెకు యిచ్చి, పిపాసనందీర్చి సేవ కులకు ఆజ్ఞాపించి గుడారమునకు గొనిపోయి శైత్యోపచార ములఁజేసి కాలిపై గుచ్చుకొనిన బాణమును దీసి తన వద్ద నున్న చిగురు సారాయమునిచ్చి మంచముపైఁ బరుండఁబెట్టిరి.

---

## ఏడవ ప్రకరణము.

—o—

### ఘో ష ణ

యోగిచే నొసంగఁబడిన ఫలమును భుజించిన తరువాత మోహిని గర్భవతియయ్యెను. ఆమెయందు భీమపాలున కత్యం త ప్రేమాతిశయములు హెచ్చెను. దినదిన ప్రవర్ధమానముగ ఆమెకు ఆరవమాసము రాగా, చూలింత గాజులను దొడగించి ఆనందముగ నుత్సవమును జరిపిరి. ఏడు యెనిమిది మాసములు పూర్తియయ్యెను. తుదకు తొమ్మిదవ మాసముగూడ పూర్తి కాగా, పదియవ మాసమున మోహిని కుమారుని గనెను. ఇరువదిరెండవ దినమున స్నానాది కృత్యములు దీర పురజను లందరు అనందానంద కందళిత హృదయూర విందులయి వారి

వారికిఁ దోఁచిన గానుకలను రాకొమరున కొసంగిరి. అబ్బాలు
నకు బారసాల మహోత్సవము జరిపి యోగి వచించిన చొ
ప్పున మోహనుఁడను నామకరణ మొనర్చిరి. రాజు తన యో
ద్భవా నందమున పట్టణముననున్న బండిత పామరులకు ధన
ధాన్యాదుల నొసంగి నిరుపేద లగువారలకును కుంటివాండ్రకు
ను అన్నవస్త్ర దానములచేసి, పురజనుల నందరిని ఆనంద డో
లికల నోలలాడించెను.

మోహనునకు యైదవమాసము వచ్చునప్పటికి యోగి
మఱల రాజదర్శనమునకు వచ్చెను. భీమపాలుఁడు పుత్రవాత్స
ల్యమున మోహినీ భవనమునందే నివసించుచుండెను. సేవకుం
డొకడు భవనమునకు వచ్చి, తన యేలికకు నమస్కరించి 'అ
య్యా! యేలినవారి దర్శనార్థము యోగిపుంగవుండు గోటద్వా
రమువద్దఁ వేచియుండెను. ఆజ్ఞ యైనచో నిటకు దోడ్కొనివ
చ్చెదను' అనిచెప్పెను. యోగి వచించినచొప్పున విషయముల
న్నియు నిక్కముగ జరిగినందులకు సంతోషించుచు సేవకునితో
యోగిని దోడ్కొని రావలసినదని ఆజ్ఞయిచ్చెను. సేవకుఁడు
వందనమాచరించి, రాజాజ్ఞను శిరసా వహించెదనను సౌజ్ఞఁజేసి
యోగిని దోడ్తెచ్చుటకుఁ బోయి "ఆర్యా! భీమపాలమహారాజు
గారి అనుమతియైనది. లోనికిఁ బోదమురండు' అని భీమపాలుని
వద్దకుఁ జనెను.

భీమపాలమోహినులు లిద్దరును మందిరమునుండి బయ

టికి మోహనునియెత్తికొని, యోగికి స్వాగతము నిచ్చుటకు వచ్చిరి. యోగి, జై శంకర్, జే గురూ, జే గోవింద్ అనుచు రుద్రాక్షమాలను చేతియందిడికొని వచ్చెను. మోహినీభీమపాలురిరువురు యోగికి వందనమాచరించి కానికఁగొనిపోయిఉచితాసమునిచ్చి, తమ వరప్రసాదమున బుట్టిన బాలుఁ డీతఁడేయని వానికిచ్చి సాష్టాంగ నమస్కార మాచరించిరి. యోగి వారిని దీవించి "రాజా! యీ బాలునకు జాతకమును వ్రాయించితివా? అటులఁ గానిచోఁ యీ క్షణముననె దైవజ్ఞులను బిలిపింపుము' అని చెప్పె. భీమపాలుఁడు సేవకులఁ బంపి దైవజ్ఞులఁ బిలిపించెను. మోహనునకు దైవజ్ఞులందఱు గూడి జాతకమును జూచి యీ కాబోవు ప్రభువునకు పదినెనిమిదవ వత్సరము అపమృత్యుగండ మున్నదని వచించిరి. వారి మాటలను వినినతోడనె మోహినీ భీమపాలు రిరువురును మూర్ఛనొందిరి. పరిచారికలు శైత్యోపచారములచేయ కొంతకాలమునకు చేష్టత గలిగెను. దైవజ్ఞులు తాము చెప్పినది దోషమని యెంచి విభ్రాంతినొందిరి. యోగి దివ్యదృష్టిని జూచి, 'రాజా! వారునుడువునది సత్యమేగాని, ఆ గండము మృత్యుగండ మైనను మిత్తిని దెచ్చునదిగాదు మీపుర సరోవరమున స్వర్ణచ్ఛాయగల మత్స్యమొకటి యుద్భవించును. దాని నోటియందు ముత్యాల హారమొకటి యుండును. పదునెనిమిదవ వత్సరాదిని యువరాజ పట్టాభిషేకము చేయుదురు. ఆ దినమున చెరువు నంతయు

వేటాడించి చేపలను దెప్పించుము. హేమకాంతిగల చేప నోటి యందుండు ముత్యాలహారమును నాటి సాయంతనమున మోహానుని కంఠమునందు అలంకరించిరేని అతఁడు దీర్ఘాయువు గల వాఁడగునని చెప్పెను. యోగియొక్క పలుకులవలన రాజున కమితానందము గలుగఁ అట్లులే జేసెదనని జెప్పెను యోగి రాజా! ఎట్టికీడు మూడునో యని నీవు చింతింపవలదు. అట్లుల చేయుదువేని అతనికి ఆయుశ్శేషము గలుగగలదు. నీ కుమారుఁడు బూర్ణాయు రారోగ్యైశ్వర్య వంతుఁడై రాజ్యమును రామరాజ్యముగ నేలునని జై శంకర్ గురూయనుచు లేచి, మోహినీ మోహన భీమపాలుర నాశీర్వదించి చనెను.

---

ఎనిమిదవ ప్రకరణము.

—o—

పూర్వవృత్తాంతము.

కొన్ని దినములకు గాయము స్వస్థతజెందెను. ఒక దినమున మాణిక్య చూడుఁడును, వానిభార్య రంగారియు ఆమె కుపచర్యల చేయుచు, ఆమె వృత్తాంతమునుఁ జెప్పవలసినదని కోరిరి. సుశీల కండ్లనీరుఁ గార్చుచు, నల్లెయని భర్తయొక్కయు తనయొక్కయు వృత్తాంతములను బూసఁగుచ్చినటులఁ జెప్పి మిగుల దుఃఖింపనాగెను. మాణిక్యచూడుఁడు తనమిత్రునకు యిట్టి యవస్థలు సంఘటిల్లెఁ గదాయని హృదయాంతర

దుఃఖము నాపుకొనజాలక ఆమె పాదములపైబడి, నేరమును మన్నించి రక్షింపుమని దుఃఖింపసాగెను. రంగారి వారి నిద్దర నోదార్చెను. మాణిక్యచూడుఁడు ధయిర్యమువహించి 'తల్లీ! నీవు విచారింపఁవలదు. జగత్సింహుని నేనిటకుఁ దోడ్తెచ్చెదను. మీ రిరువురును నా గృహమునందే నివసింపవచ్చును. మాణిక్యచూడునకును జగత్సింహునకును యెట్టిమైత్రి గలదనిమాణిక్యచూడు నడుగ, అతఁడు సుశీలతోఁ 'సోదరీ! మా మైత్రిని గూర్చి వచించెదను శాంతచిత్తవై నాలకింపుము' అని జెప్పెను.

పూర్వమీ ప్రాంతమున కాంతా పురమను పట్టణము గలదు. దానిని చంద్రసేనుఁడను రాజు పాలించెను. ఆరాజునకు గుసుమవతియను ముద్దుల గూతురు గలదు. ఆ కల్కిమిఠారి సౌందర్యము రంభను ధిక్కరించు—పద్మినిని పరిభవించు—లక్ష్మితోఁ దులఁదూగు—సకలశాస్త్ర పాండిత్యమునందును శారద నోడించు—రూపశాలినియగు శాంకరిని సోదరిసిగాఁజేయు. సామాన్యమైన యొత్తరి. ఆమె ముఖారవిందమును గాంచినంతనే, గాంచు ప్రతి మనుజుని హృదయము పెనఁగులాడు. దేటిరెక్కలఁ ధిక్కరించు కురులును, ముత్తెముల కోవయని భ్రమింపఁజేయు పలువరుసలును, జలజపత్రముల ధిక్కరించు నయనమ్ములును, మేలుగులాబి పూలఁబోలు చెక్కిళ్ళును, సామాన్యతరుణీ నాసాగ్రంబును కైవారంబుఁ సేయఁదగు కోటిటీరు నాసాగ్రంబును, మెరపైనె మిగుల కోమలమై యుండు

నధరంబును, ఘూబంతులోయను భ్రమను గలిగించు పాలిండ్లు ను, పిడికిట నిముడుహాయను సందియముదోచు సన్నని నడుము ను, చక్కదనంబునకుఁ నగినవో యనునటుల కదళీ కంబ ములఁబోలు యూరువులను గలిగి హృదయభాస్కరుని తేజము ను ధిక్కరించు మేలిమిబంగరు చ్ఛాయనుగలిగి యకాంతా మణియొక్క రూపంబు అజ్ఞారే! ఏమనవచ్చును.

కుసుమవతికి యుక్తవయస్సు వచ్చుటచేఁ చంద్రసేనుఁ డు పెండ్లికొమరునికై దేశదేశములకుఁ బురోహితులఁ బంపె ను. కాంతాపురమునకు సుమారు ఎనిమిది గ్రోసుల దూరము న చంద్రశిలానగరము గలదు. ఆ పట్టణమును చక్రదత్తుఁడను రాజు పాలించుచుండెను. అతనికిఁ మిగుల ధయిర్యస్థయిర్య బలపరాక్రమ వంతుఁడును స్వర్గభాస్కరుని ధిక్కరించు తేజ ముగల సూరసేనుఁడను కుమారుఁడు గలడు. కుసుమవతి యొక్క ఛాయాచిత్రమును చూచిన నాఁటినుండియు సూరసే నున కామెను బరిణయము మాడవలెనను యుద్దేశ్య ముదయించె ను. చంద్రసేనునకు, చక్రదత్తునకును వైషమ్యముగలదు. అట్టి కారణమున సూరసేనుఁడు జతురోపాయములఁ ఆ చం ద్రసేనుని వశముజేసుకొనిబరిణయమాడుటకుప్రయత్నించెను. చక్రదత్తునకీ విషయము దెలియుటచేఁ గుమారుని బిలచి అట్టి యుద్యమమునకు బాల్పడవలదని నిర్బంధించెను. దేశదేశములు పెండ్లికొమరునకై పోయిన బ్రాహ్మణులు రాకొమరిత బట

ముల నిచ్చి రాజ తనయుల బటములను దీసుకొనుచుండెడి వారు.

సూరసేనుండు తన మిత్రుఁడైన జగత్సింహునితోఁ తన పట్టణప్రాంతముననున్న యరణ్యమునకు, మృగయా వినోదార్థమై, అశ్వారూఢుడై చనెను. విష్ణుశర్మయను బ్రాహ్మణుండు, కుసుమవతియొక్క ఛాయాపటము నాదారిఁగొనిపోవుచుండెను. కాంతాపురవాసు లెవరును చంద్రశిలానగరముగుండ పోఁగూడదని చక్రవర్తుఁడొక శాసనమును విధించెను. విష్ణుశర్మ అట్టిశాసనము నుల్లంఘించెను. సూరసేనుండా బ్రాహ్మణుని దారి కడ్డునడి ఆపి యాతని వృత్తాంతమును దెలుపవలసినదని గోరెను. విష్ణుశర్మ భయభ్రాంతుఁడై కరముల, మోడ్చి వణకుచు తన వృత్తాంతమును చెప్పెను. సూరసేనుఁడతని వద్దనున్న చిత్రపటమునుఁ జూపవలసినదన విష్ణుశర్మ అటులే యొనర్చి ఆ పటమును తామందుకొనినచోఁ తమ చిత్రపటము నీయవలసియుండుననని చెప్పెను. జగత్సింహుఁడతనితోఁ శత్రుసంబంధము నామోదింతువా యనఁ దలయూపి, విష్ణుశర్మకు రహస్యమార్గమునుఁ జూపి తను మందిరమునకు గొనిపోయి, అచ్చట విష్ణుశర్మతోఁ యోచింతమని జెప్పి విష్ణుశర్మను తమ మందిరమునకు కొనిపోయిరి. సూరసేనుఁడు తన ఛాయాచిత్రము నా విష్ణుశర్మకిచ్చి కుసుమవతికి తన బటమును జూపి తన్నుఁ బరిణయ మాడవలసినదని జెప్పితినని చెప్పవలసి

నదిగా ఆజ్ఞనిచ్చి, యీనామముగఁ యున్నారు రూపద్వయము లాత
నికిచ్చి రహస్యమార్గమున బంపిరి.

విష్ణుశర్మ కాంతాపురమునకుఁ బోయి చంద్రసేనునకు,
దెలియకుండ సూరసేనుని బటమును గుసుమవతి కిచ్చెను.
సూరసేనునిగూర్చి యీ వరలోఁ దెలిసికొనియుండుటచే చిన్న
నాఁటనుండియు వాంఛించుచుండిన వరుండే తనకు గాగలఁడని
గుసుమవతికిఁగలిగిన యానంద మింతయని నుడువ నలవిగాదు.
విష్ణుశర్మ గుసుమవతియొక్క మరియొక ఛాయా చిత్రమును
గైకొని చంద్రసేనునివద్దకు బోయి, గుసుమవతికిఁ దగిన వరుఁ
డు తన కెచ్చోటను లభింపలేదని జెప్పెను.

చంద్రదత్తునకు సూరసేనుఁడు చేయు ప్రయత్నములు
దెలియగా కోపోద్దీపిత మానసుండై సూరసేన జగత్సింహు
లను సభకు బిలిపించి, వారిపై నేరారోహణము చేసి వా రిరు
వురును రాజద్రోహులనియు, కులద్రోహులనియు, వారు
తన యనుమతిని ధిక్కరించిరనియు వచించి, సేవకులను బిలచి
వారిని తన రాజ్యమునుండి గొనిపోయి శిరములఁ దీయుఁడని
కఠినాజ్ఞ నిధించెను. సేవకులు వా రిరువురకు కాంతాపురము
నకు జెందిన ఒక ఘోరారణ్యముఁనగల వటవృక్షముక్రింద శిర
ములఁదీయ యత్నించుచుండిరి. నేను దరిదాపుననే నా పరివా
రముతోఁ గుడారములను వేసికొని, జింకల వేటాఁడుటకుబయ
లుదేరితిని, చూపుమేరలోనున్న వటవృక్షముక్రింద నూతన

వ్యక్తులుండుటఁ గాంచి, చంద్రసేనునిపై గుట్రలు బన్నుటకు వచ్చిన శత్రులేమోయని తలఁచి నా యశ్వముపై వారియొద్దకు వేవేగఁ బోతిని. నన్నుఁ జూచినతోఁడనే వారు నిశ్చేష్టులయి నిలచియుండిరి. నా యశ్వమును దిగి వారి నాటంకపరచి నేరస్థులయి నిలచియున్న సూరసేన జగత్సింహులను పరికింప వారియందు క్షత్రియధర్మము లగుపడుటచేఁ వారివద్దకుఁ బోయి మీ రెవరు అని బ్రశ్నించితిని. కండ్లనీరు గార్చుచు వారిరువురు నా కాళ్ళపైఁబడి నన్ను శరణుజొచ్చిరి. నేను వారికభయంబిచ్చి వారి యావద్వృత్తాంతము నడుగ వారు మిగుల వినయ విధేయతలతోఁ తమ వృత్తాంతమును జెప్ప కోపాయత్తచిత్తుఁడనై సూరసేన జగత్సింహుల శిరములఁ దీయవచ్చిన పండ్రెండుగురను ఆ వటవృక్షమునకు బలినిచ్చి, వారి నిరువుర నా గుడారమునకుఁ దోడ్కొనిపోతిని రెండు దినములు గడచెను. సూరసేనుఁడు నాతోఁ చంద్రసేనుని గూతురగు కుసుమవతిపై తనకుండు అనురాగమునుగూర్చి ముచ్చటించెను. నేను వానికి ధయిర్యమును బురికొలిపి చంద్రసేనుఁడు కుసుమవతిని తనకిచ్చి బరిణయము చేయునటులఁ జేసెదనని నుడివితిని. మూఁడు దినములు గడచెను నాలవ దినమున, మేము మువ్వురము కాంతా పురమునకుఁ బయలుదేరి మొదవదినము మధ్యాహ్నము మూఁడు ఘంటలకు కాంతాపురము జేరితిమి. రాజహార్మ్యములను, వివిధ సౌధములను జూచి కుసుమవతి నివసిం

చు సౌధమును గనుంగొంటిమి. ప్రభాకరుండు పశ్చిమాద్రి నలంకరింపక పూర్వమె మాబసకుఁ బోయి, భోజనాది కృత్య ములఁ దీర్చుకొని, చీకటి వడినంతనే గుసుమవతి భవనమువద్ద కుఁబోతిమి. జనసంచారము సన్నగిలువరకు వేచియుండి, సూర సేనుని రహస్యముగఁ కుసుమవతి భవనములోనికిఁ బంపితిమి.

కుసుమవతి భవనమునకు జుట్టును సుమారు ముప్పది అడుగుల యెత్తుగల గోడకలదు. తాపీవాండ్రు తమ నైపుణ్య మును చూపి కుడ్యో పరిభాగమున వేయి వలయముల నేర్ప రచిరి. అట్టి వలయములలోఁ లోహతంతులచే నల్లబడిన వల లమర్చఁబడెను. ఆవలయ శిఖరములపై వివిధవర్ణములు గల విద్యుద్దీపము లమర్చబడెను. తూర్పుదిక్కున సింహద్వారము కలదు. సేవకులు నివసించుటకు ఒక భవనము యేతద్భాగము ననే గలదు. లోపల ఆవరణములో కుడ్యమునకుఁ జేరి పూల మొక్కలు గలవు. గోడకు సుమా రిరువదిగజముల దూరమున నాలుగువైపులను పూలమొక్కల బారు లేర్పర్చబడి నాటబ డెను. పూలమొక్కలమధ్య నిరుప్రక్కలను పలురకముల క్రోట నుమొక్కలుగల బాటలుగలవు. మధ్య మధ్య నచ్చ టచ్చట నుద్యానవనమునం దంతను లోహముచే నమూరు చేయఁబడి మీాటను అదిమినంతనే యిరుప్రక్కల మొక్కల పిపాసఁ దీర్చు టకోయను భ్రమను గలిగించు చిమ్మెన గ్రోవులను చేతులతో బట్టుకొనియున్న విగ్రహములు గలవు. ఇట్టి వనమువరకు జుట్టును

విశాలమగు స్థలమును గలిగియున్న కుసుమవతి భవనముగలదు ఈ హర్మ్యమునకు మూడు అంతరములు గలవు. చల్లని తెమ్మెరలు లోనికిఁ జొచ్చుటకు నలుదిక్కులను గవాక్షములు గవాటములు గలవు. ప్రాగ్దిశను ముఖ్యద్వారములు గలవు. గోడలన్నియు మెల్లవేయఁబడి మిక్కిలి కాంతివంతముగ నుండెను. మొదటి అంతస్తునందు గోడలకు పాలగచ్చు చేయఁబడి విద్యుద్దీపము లమర్పఁబడెను. ఈ అంతఃపురమునందు కుసుమవతి చెలికత్తెలు నివసింతురు. మొదటి హాలునుండి మొదటి అంతస్తునకు సున్నముతో గట్టఁబడిన సోఫాసములు గలవు. మొదటి అంతస్తునుండి రెండవ అంతస్తుకు జోనలెను. రెండవ అంతస్తునందు విశాలమగు హాలుగలదు. రెండువైపుల మాత్రమేగదులుగలవు. అందొక వైపుననున్న గది స్నానాది కృత్యములకు నుపయోగింతురు రెండవగది కుసుమవతి యలంకరింపులకు నుపయోగింతురు పశ్చిమ దిక్కునమాత్రము ఒక గదిగలదు. ఆ గదియందు ఫలహారములఁ చేయుదురు. నాలుగువైపులను గోడలకు నిలువుటద్దము లతికింపఁబడెను. అట్టి నిలువుటద్దములపై చిత్ర విచిత్రములగు పటము లమర్చబడెను. వాటి శిరములపై విద్యుద్దీపములు నలుదెసల నమర్చబడెను. సరంబీ అంతయుఁ విద్యుద్దీపములచే నలంకరింపఁబడి పచ్చ టచ్చట ఒక పీకనయుండెను. మీటను గీటినచోఁ విద్యుద్దీవనలు తమ నడకను ప్రారంభించి చల్లని గాలిలో దేల్చుచుండును. అపరం

జిలుగుటూయల యొకటి నవరత్నఖచితమై ఛాదీ గొలుసుల తోఁ ఒక దూలమునకు వ్రేలాడుదీయబడి యుండెను. దాని పై దోమతెర యొకటి గలదు. విద్యుచ్ఛక్తి వలననె ఆ వూయలకు చలనము గలుగును. కుసుమవతి ఈ యూయలలో బరుండును. పశ్చిమ దిక్కునున్న పలహారముల గదినుండియె మూఁడవ యంతస్థునకుఁ బోవలయును. ఆ మూఁడవ యంతస్థు కుసుమవతి శయనమందిరము.

కుసుమవతి మందిరము దెలిసికొని లోనికిఁ బోవుట యెట్లులాయని యోచించితిమి. నావద్ద తాడొకటి గలదు. అద్దాని కుడ్యవలయ శిఖరమునకు మరెఁబోసి దాని యాధారమున సూరసేనుని లోనికిఁ బంపవలెనని యూహించితిని. పగలు లోనికిఁ బోవుటకు వీలు చిక్కినదిగాదు. పోతుటీగ దూరుటకునైనను వీలులేనటుల గావలివాండ్రు ఫారా నిచ్చుచుండిరి. సౌధముజుట్టు స్త్రీసేవకులు గావలిఁ గాయుచుండిరి. మేమా విచిత్రమును గాంచి సూర్యుడెపుడు హస్తమించునా యను గుతూహలమున కొలదికాల మచటనే కూర్చుండి దినకరుఁడు పశ్చిమాద్రి నలంకరింపక బూర్వమె, మా బసకుఁబోయి భోజనాది కృత్యముల దీర్చుకొని గుసువమతి భవనమువద్దకుఁ బోతిమి. సాయంతన మయ్యెను. చంద్రుఁడు చెట్లకొమ్మల యడ్డు దొలగించుకొని భూభాగమునంతను కాంతివంతముఁ జేయుటకై మిక్కిలి శ్రమనొంది పై కెగఁబ్రాకెను నాఁడు

సప్తమియగుటచే కొలఁది కాలమునకే హస్తమింప ప్రారంభింప, చంద్రునిబాధ నొందజాలక చీకటివాని శరణజొచ్చి, భూభాగము నలుపుజేసెను. పట్టణ వీధులన్నియు నిర్జనమైయుండెను. అట్టి సమయమున మేము త్రాటిని కుడ్యోపరివలయ శిఖరమునకు బోసి దాని యాధారమున సూరసేనుని లోనికిఁ బంపితిమి.

సూరసేనుఁడు త్రాటి యాధారమున మెల్లగ గోడపై కెగబ్రాకి ఆ త్రాటిని లోనికి మార్చుకొని లోనికి బ్రవేసించెను. ఏదేని యలికిడి గలుగనేమోయను భీతిచే అతఁడు వ్రేళ్ళపై మెల్లమెల్లగ పూలమొక్కలనీడను భవనమువద్దకు చేరెను. తూర్పుదిక్కున మాత్రమె స్త్రీసేవకులు గావలియుండిరి. మూడువైపులను సూరసేనుండు మార్గమేదియైన యున్నదాయని వెదకెను. గాని పైకిఁ బోవుటకు మార్గ మగుపడలేదు. పశ్చిమమున భవనకుడ్యము నానుకొని నీటిగొట్టమొకటి భవనము లోనికి జొచ్చెను. దాని యాధారమున రెండవ యంతస్థువరకు పై కెగఁబ్రాకి తెరుఁవబడియున్న గవాక్షమును గాంచెను. కుసుమవతి రెండవ యంతస్థున నిద్రింపకబోవుటచే ముప్పురు స్త్రీసేవకులు మాత్రమె నిద్రించుచుండిరి. లోపల నున్నవారిలో రాకొమరిత లేకపోవుటచే ఆ గొట్టమును బట్టుకొని మూడవయంతస్థున కెగబ్రాకెను. మూడవ భాగమున జట్టు వసార యొకటిగలదు. సూరసేనుండు మెల్లగఁ లోనికి

దిగెను. అచ్చట యిరువురు స్త్రీలు నిద్రదేవతను గొల్చుచుం డిరి. వారిని జూచి తన జేబునందున్న రుమాలునుదీసి వారి నాశికలవద్ద బెట్టెను. వారు గాఢనిద్రజెందిరి. ఉత్తర దక్షిణ దిక్కుల నిద్దరు స్త్రీలు మాత్రమె గావలి గాయుచుండిరి. అతఁడు ధైర్యమువహించి దక్షిణదిక్కునకుఁ బోయి యామె వెనుకనుండి కండ్లుమూసి చేరుమాలు నామె ముక్కువద్దఁ బెట్టెను. అంతట స్త్రీ మొదటనరికిన చెట్టుచందమున బోరగిల బడి నిద్రాదేవతను శరణుజొచ్చెను. ప్రాగ్దిశకు బోయెను. ఇద్ద రుస్త్రీలు ఖడ్గముల చేతఁబూని నిమీలిత లోచనులై గూర్చు నియుండిరి సూరసేనుండు జేబునుండి సీసా నొకదానిఁదీసి వారి ముక్కులవద్దఁ బెట్టెను. ఇంకొక నిశాచరి మేలుకొనియుండుట జూచి దాని వెనువెంటఁబోయి కండ్లుమూసి సీసానుముక్కువద్ద బెట్టి "ఓసీ! నాకుపకారము చేయుము. నీకు మేలొనర్చెదనని జెవిలో చెప్పెను.' మత్తునందు నాఘ్రాణించుటచేఁ ఆమెగూ డ మిగిలినవారితో జెలగాట లాడజొచ్చెను.

సూరసేనుఁడు నెమ్మదిగ దలుపునుఁ దెరచెను. మేలిమి ఛాయ మేనెల్ల బ్రకాసించుచున్న యొక కాంత హంసతూలిక పై బరుండియుండెను. అతఁడు మెల్లగ శయ్యవద్దకుఁ బోయి దోమతెరను తొలగించి, అక్కాంతామణి ముఖారవిందమును గాంచి ఛాయాచిత్రమునఁ జూచిన కుసుమవతియేయని దలఁచి, దరినున్న సోఫాపై గూర్చుండి తాంబూలాచర్వణముఁ జేసి,

మేజాపై నున్న వీణనుదీసి తంతుల సవరించి, విపంచిని మొద లు పెట్టెను. తంతీనాదముచేఁ నిదురనుండి మేల్కాంచి రెండ లు విరచుకొనుచు అటునిటు జూచి, చిత్రా! యీ నడిరేయిఁ వీణను మీటుచుంటి వేమి యని ప్రశ్నించెను. సూరసేనుఁ డామెపలుకుల నాలకించి వీణనుమీటుట నాపినేసెను. కుసును వతి కండ్లఁనులుముకొనుచు దిగ్భ్రమజెంది యులికిపడి శయ్యపై నుండి అత్యాతురతోఁ దిగి కోపోద్దీపిత మానసియై "ఓయీ! మీ రెవరు స్త్రీల యంతఃపురములోని కేలజొచ్చిరి? చోరులా! దుర్మార్గులా? యెవరి ఆజ్ఞవలన మీరిటకు వచ్చిరి? కాంతలుండు యంతిపురములకుఁ బురుషులు రావచ్చునా?' యని ప్రశ్నిం చుచు, "చిత్రా! చిత్రా!' యని కేకవేసెను. ప్రత్యుత్తరము లేదు. భయభ్రాంతరాలై మఱల శయ్యపై గూర్చుండఁబోయె ను. సూరసేనుఁడు సోఫామీదనుండి లేచి——"కలికీ! యీ అంతఃపుర మెవరిది? యిందు నివసించు పూఁబోఁడి నామంబెద్ది' యని ప్రశ్నించెను. కుసుమవతి కోపముతోఁ యియ్యంతిపుర మున,చంద్రసేనుని గూతురగు కుసుమవతియను కాంత నివసిం చుచుంతును. మీ దేయూరు? మీ నామంబెద్ది? స్త్రీల యంతః పురములోనికి మీరు వచ్చుటచే మాతండ్రిగారి యాజ్ఞ నుల్లం ఘించిరి. ఎల్లి యరుణోదయముననే మీకుఁ దగుశిక్ష విధింపఁ బంచెదనని చెప్పెను. చిరునగవుతో, "కాంతా! నీమనం బెవరి కొరకు బరితపించుచున్నదో ఎవరి హృదయపద్మము నాకర్షిం

చినదో—ఎవరిఛాయాచిత్రమును రహశ్యముగఁ గోరినదో—అట్టివాడ - సూరసేనుఁడందురు. కుసుమవతి సిగ్గుచే దలవంచుకొని, నా అపరాధముల మన్నింపుడు. మీా దాసి కఠినోక్తుల నాడినదని యూహింప క్షమింతురనుచు, అటునటు పరికించి మీారీ యర్థరాత్రమున యిచ్చటి కెటులరాగలిగిరి? గావలియున్న పిశాచములు జొరనిచ్చెనా' అని ప్రశ్నించెను. "పురుషుఁ డెట్టికార్యములనైనను జేయగలఁడు. పంచశరుడిటుల శరముల సంధించుచుండ కష్టమన్న దోచునా? ఎకారణముననో నా రాక నెఱింగియె గాబోలు నీ సేవకులందరును నిద్రదేవతకు సేవసేయుచుండిరి. నా మనోపహారివగు నీవాంఛఁ దీర్చుటయే నీ మనోహరుని గర్తవ్యమైయున్నది. అట్టి కారణముననె నే నిచటికి రావలసిన వాఁడనైతిని"—"హృదయేశ్వరా! గాంధర్వముకన్న బ్రాహ్మ్యమే మేలుగద—ఒండొరులు హృదయములను యొండొరుల హృదయములు దొంగిలించినప్పుడు గాంధర్వమేమున్నది? గావలసినది బ్రాహ్మ్యమే!' హరిణాక్షి సిగ్గుచే సూరసేనుని దరిఁజేరి నేదియో రహశ్యమును వానిజెవిలో చెప్పెను. సూరసేనుఁడు నవ్వుచు "నేనిచట నుండవలదు. నా మిత్రులు, ద్వారమువద్దఁ వేచియుండిరనుచు దవ్వున పోఁబోయెను. అయ్యలివేణి వాని కరముఁ బట్టుకొని ముద్దాడి మెడలోనున్న పూలహారమును - యీతఁడే నా మనోహరుఁడని దెలుపుటకు గాబోలు వానిమెడలో నలంకరించి, బద్ధాంజలియై

నమస్కరించి సౌధమునుండి ఆవలకు బోవు రహస్యమార్గము వానికి జూపెను. సూరసేనుఁడును గుసుమవతి చెక్కిలిముద్దాడి ఆమెనే బరిణయమాడుదునని వచించి బైటకు బోయెను. తెల్ల తెలవారుచుండు వేళ సూరసేనుడు మావద్దకు వచ్చి అచటి చర్యనంతను జెప్పెను. వాని మాటల నాలకించి, ప్రయత్నము నెరవేరునని తలఁచి వానికిఁ దగు ధైర్యవచనములఁ బలికితిమి.

ఆ ఉదయముననె మేము చంద్రసేన దర్శనమునకు బోతిమి. అతఁడు మాకు అర్ఘ్యపాద్యము నొసంగి అతిథి సత్కారములు చేసెను. సుమారు పదిఘంటలు కాఁవచ్చెను. భోజనాంతరమున సంభాషణ మందిరమునకు మముల దోడ్కొని పోయి, కుశలప్రశ్న పూర్వకముగ మా రాకఁగూర్చి ప్రశ్నించెను. మేము మా యావద్వృత్తాంతమును బూసగ్రుచ్చినటుల జెప్పితిమి. చంద్రసేనుఁడు కొంత తడవేదియో యోచించి, మముల నచటఁ విడచి ఆవలబోయి, కొంత కాలములోనె దిరిగివచ్చెను. సేవకుఁ డొకడువచ్చి నమస్కరించి "ప్రభూ! తమ ఆజ్ఞను నెరవేర్చితినని చెప్పెను. కుసుమవతి తండ్రి యాజ్ఞానుసారముగ ధౌతవస్త్రి, సర్వాభరణాలంకృతయై అందలము నెక్కి జనకుని భవనమునకు వచ్చెను. మఱియొక భటుండు నమస్కరించి "మీ ఆజ్ఞప్రకారము తమ పుత్రిక వచ్చియుండి రని చెప్పెను. భటుని మాటల నాలకించి, చంద్రసేనుఁడు మమ్ముల విడచి కుసుమవతి గూర్చున్న చోటునకుఁ బోయి

'కుమార్తెతోఁ అమ్మా! నీవే రాసుతుని గూర్చి నిత్యము
ముచ్చటించుచుంటివో అతఁడే యిచ్చటికి వచ్చియుండెను.
దుఃఖోపశమనము చేసికొనుము. నేఁటితో నీకోర్కె లీడేరును.
సమ్మతింతువేని నిన్ను వానికిచ్చి బరిణయ మొనర్చెదనని జెప్ప
గుసుమవతి సిగ్గు నభినయించుచు "జనకా! మీ యాజ్ఞానుసా
రముగ వర్తించుదానను. భగవంతుని గటాక్షముచే కోర్కె
సఫలమయ్యెడి దినము వచ్చినది. గావున మీ యిచ్చవచ్చిన
టులఁ మెలగుదానను' అని చెప్పఁ చంద్రసేనుఁడు గుసుమవతిని
విడచి, సూరసేన జగత్సింహులుండు చోటకు వచ్చి వారి
నిరువురను ఆమెయుండు చోటునకుఁ దోడ్కొనిపోయి, ఆమెను
జూపెను. కుసుమవతి సిగ్గుచే యొకవైపునకు దిరిగి నిలచి యుం
డెను. హృదయానంద ముప్పొంగ చంద్రసేనుఁడు, కుసుమవ
తితోఁ. "యీ యువకుఁడే నీ మనోహరుఁడు" అని జూపెను.
సేవకురాలు యొకరిత, పూలదండలను దెచ్చెను. పూమాలను
కుసుమవతి మెడలో వేసెను. సూరసేనుఁడు మరొక మాలను
కుసుమవతి మెడలో వేసెను. చంద్రసేనుండు సుహృద్భావము
గల వాఁడగుటచే యిందొరుల ప్రేమాతిశయముల గాంచి
శత్రుతనయుండనిబాటింపక శుభముహూర్తమున సూరసేనునకు
కుసుమవతి నిచ్చి పెండ్లిచేసెను.

'సోదరీ! నీవు చంద్రసేనుని వద్దనున్న సుబుద్ధియను
మంత్రి గూతురవు. సూరసేన జగత్సింహులు, మిత్రులగుటచే

వారిద్దరి మైత్రిని గాంచి, చంద్రసేనుఁడు నిన్ను జగత్సింహునకిచ్చి పెండ్లిచేసెను. చంద్రసేనుఁడు నన్ను నా పరివారముతో తన పట్టణమునకు వచ్చి యుండవలసినదని కోరుటచే, నా పరివారముతో కాంతాపురమునకు రాజునకుసేవజేయుచుంటిని. చంద్రసేనుఁడు పుత్రసంతాన హీనుఁడగుటచే తన, వృద్ధాప్యము వచ్చుటచేతను, జామాతయగు సూరసేనుని పట్టాభిషిక్తుని జేసెను. జగత్సింహుఁడు వానివద్ద మంత్రిగానియమింపఁబడెను. నేఁ కోయవాడ నగుటచేతను, విలువిద్యయందు నిపుణుఁడనగుటచేతను, నన్ను వారి సైన్యాధిపతిగ నియమించిరి.

ఇట్లుండ కొంతకాలమునకు, చక్రదత్తుఁడు సూరసేనునిపై దాడివెడలి యర్ధరాత్రిమున సైన్యమునంతను కొల్లఁగొట్టి, సూరసేన కుసుమపతులను చంపివైచెను. జగత్సింహుండును, నేను, మరికొంతపరివారమును మిగిలియుంటిమి. మఱుచటి యుదయముననె, మే మిరువురము చక్రదత్తునివద్దకుఁ బోయి, అతఁడట్టి ఘోరకృత్యము నేలజేసెనోయని ప్రశ్నింపఁ గుమారునిపై నుండు కోపమున అతఁడట్టి పాపకార్యమును జేసితినని పశ్చాత్తాపమునొంది దుఃఖించుచు ప్రాణములవిడచెను. కాంతాపురము పాడగుటచే మనమందరము గొంత పరివారముతోఁ యిచ్చ్యరణ్యమున చేరియుంటిమి. ఒకదినమున భీమపాల మహారాజు యడవికి వేటకై వచ్చి భూరుహముక్రిందవిశ్రాంతి గైకొనుచుండె. మే మిరువురము గూఁడ వేటకై బోయి యుంటిమి.

అచట భీమపాలుని కంటఁ బడితిమి. మా చరిత్రము నంతను దెలసికొని, మమ్ములను ఆయనవద్దకు రావలసినదని సేవకులచే కభురుబంపెను. మేము వానివద్దకుబోతిమి. అతఁడు మమ్ముల గౌరవవించి, మా వృత్తాంతంబడుగ మా చరిత్రమునుఁ జెప్పితిమి. మామగారగు చక్రదత్తుని మరణవార్త విని మిగుల దుఃఖించె. కొంతతడ వూరకుండి మమ్ములను తనరాజ్యమునకు రావలసినదని కోరెను. నేను అందుల కంగీకరింపలేదు. జగత్సింహుండు రాజ్యపాలనా తంత్రముల నెఱుంగ గుతూహలుఁడై సమ్మతించెను. జగత్సింహుఁడు నన్ను విడచి యున్నను మా మైత్రి చెడియుండలేదు. వేటకు వచ్చినపుడెల్లఁ నన్నుజూచియె పోవుచుండెడివాడు. జగత్సింహుఁడు నన్నువిడచినప్పటినుండియు నేనీ యరణ్యమున నా పరివారముతోఁ నివసించుచున్నాను. అంతఃపుర స్త్రీనగుటచే నన్ను నీవు చూచియుండలేదు. నన్ను మాణిక్యచూడుఁ డందరు. నీకెట్టి ప్రాణాపాయము గలుగదు.

—o—

తొమ్మిదవ ప్రకరణము

—o—

నిర్బంధనము.

రాత్రి సుమారు పండ్రెండుఘంటల కాలమయ్యెను. శ్రావణమాస మగుటచే ఆకాశమంతయు నల్లని మేఘములతో నిండియుండెను. వీధులన్నియు నరసంచార సూన్యములై

యుండెను. హోరుమనుచు గాలి వీచుటచే పట్టణమున వెలిగిం
పఁబడిన దీపములన్నియు నొక్కపెట్టున ఆరిపోయెను. దిక్కుల
న్నియు జంబుకల ఆరావములతోఁ నిండియుండెను. మార్గ
మగోచరముగ నుండెను. నక్షత్రకాంతితప్ప వేరొకొండులేదు.
అశ్వాలయములయందు అశ్వముల సకిలింపులు హెచ్చెను.
ఎప్పుడు అరుణోదయమగునా యని కుక్కుటములు కూయు
చుండెను. అట్టి నడిరేయిఁ నిశాచరివలెనళిని ప్రభావతీసమేతయై
జగత్సింహుఁడుండు కారాగారమునకు బోయి కావలి వాండ్రకు
పారితోషికముగ గొంతధనము నొసంగి, వారిని తనవశముజేసుకొని
భీగములనుగ్గై కొని జగత్సింహుండుండు గదియొద్దకుఁ బోయి
తలుపుఁదెరచి లోనికిఁ బోయి, మారు వేషముననున్న అగంర
కాను విసర్జించి, బంధీకృతుఁడైన జగత్సింహుని జూచి "జగ
త్సింహా నా మనోపహారీ! నా ప్రార్థనల నాలకించితివిగాదు.
నే ప్రథమమున గోరియుండిన రీతిని నా పలుకుల కొడంబడి
యుంటివేని యిట్టి యిక్కటుల బాలు గావుగద అయినను
విచారింపనేల? ఈ చెరసాల అంతయు నా చేతియందున్నది.
గావున నిన్ను చెరవిముక్తుని చేసెదను. నా కోర్కె నీడే
ర్పుము' అని బలుక, బంధీకృతుఁడై చెరసాల యందు తనపై
భగవత్సంకల్ప మటుల పరిణమించెఁ గదాయని విచారించు
చున్న జగత్సింహుఁ డాపలుకులను విని, 'మీరు ఎవరు! యీ
యర్థరాత్రమున యొంటరులై, యీ చెరసాలలోని కెట్టులవ

చ్చిరి? చెరసాలాధికారులు జూచినచో మిమ్ముల బాధింప కారా గారబద్ధులఁజేసెదరు కావున వేవేగనావలకుఁబొండు. యిది పురుషకై ధీలుండుస్థలముగాని స్త్రీలుకై ధీలుండు స్థలముగాదు. ఇందుండవలదు. ఆవలకు బొండు' అని చెప్పెను.

నళిని జగత్సింహుఁడు బరుండియున్న వేదికవద్దకుఁబోయి చిన్ననాఁటనుండియు ఎవతె తనమనంబున నీమనమును గోరుచున్నదో ఎవతె నన్ను తన మందిరమునకు రప్పించి తన కోర్కెల నీడేర్పుమని నిన్ను బరిపరివిధముల ప్రార్థించినదోఁ ఎవతె పంకశరుని బాణములకు లోనై నీపై మన్మథశరములు సంధిప నుద్దేసించినదో యెవతె నీపాదసేవఁ జేయుటకునుద్దేశించి నిన్ను బొకులాఁడినదో యెవతె టక్కరితనమువలన భీమపాల మహారాజుచే నిన్ను కారాగారబద్ధుని జేయించినదో యెవతె నీపాదసేవచేయుటకు సంసిద్ధురాలైయున్నదో అట్టి నీసేవకురాలు నళిని.

జగత్సింహుఁడు దిగ్గునలేచి తనలోఁ ఆహా! ఏమివిపరీతము — స్వర్గమునకు బోయినను విడాకులు దప్పవను ఆర్యోక్తి దప్పక చెల్లుచున్నదే! నన్ను భవనమునకు రావలెనని బెట్టవలసినన్ని యిక్కట్టుల బెట్టి, నేడీ యర్ధరాత్రిమున బిశాచమువలె వచ్చినది. నాకు యీావరలో విధించిన శిక్ష చాలదుగాబోలు. నన్నీ బిశాచమింకను బీడించుచున్నది. నాకుఁ యింకను ఏదియో గీడు రానైయున్నది. కానియెవల యీా యర్ధరాత్రిమున

యీమె యిచ్చటికి వచ్చియుండదు. నళిని అర్ధరాత్రిమున కారాగారమునకు వచ్చినదని భూపాలునకు తెలిసినచో భీమపాలుఁడు నాకు దప్పక యురిశిక్షనే విధించును. ఐనను యీమెకు నీతివచనములఁ జెప్పి ఆవలకుఁ బంపువాడ ననుకొని, అమ్మా! మీరీ యర్ధరాత్రిమున ఎందులకీ స్థలమునకు వచ్చిరి. మీరీ యుద్యమమును మరల్చుకొనరా? యెంతదుష్కృత్యమున కొడఁబడితిరి. జ్ఞానమబ్బిన నాఁటనుండియు బుత్రినివలె మీ సన్నిధిని సంచరించిన నాకు యిట్టి ఘాతఁ దెచ్చుట మీకు న్యాయమా! ప్రభువు యీవరకే నాకు దగుశిక్ష విధించియుండె ఇంకను నన్ను హింసింతురా? గావున మాతా! నాపైనున్న నీ మనోవాత్సల్యమును మరల్చుకొని నన్ని కడఁసారి ప్రాణములతోఁ బ్రతుకనిమ్ము. నన్ను రక్షింపుడు. మీరు యింకను బెడదారినే ద్రొక్కుచున్నారు. ఇక మీ యుద్యమమును మాని నిజసదనమునకుఁ బోయి సుఖింపుడు.

నళిని చిరునగవు నవ్వి “మనోనాథా! మీరటుల వచింపవద్దు. మీ పలుకులన్నియు, నాకుఁ గర్ణకఠోరముగ నున్నవి. నా మనంబంతయు నీ మనంబుతోఁ లీనమైయున్నది. మిమ్మింక విడవఁజాలను. నా కోరికను దీర్పుడు. నా కోరికల నీడేర్చితి రేని మిమ్ము ఎల్లి యరుణోదయముననె కారాగార విముక్తులఁ జేసెదను. మన మిరువురము, యీ పట్టణమునుండి బోయి ఏయరణ్యముననైనను, స్వేచ్ఛగఁ కాలమును గడుపుకొందము.

సుఖమనుభవింపఁ గోరువారలయినచోఁ నా పలుకుల నాలిం
చి నన్ను చేపట్టుఁడు. మీకును నాకును క్షేమముగాఁగలదు.

హరహర! యీ భూలోక నరకమును అనుభవింపక
దప్పదుగాబోలునని చెవులఁ మూసికొని కండ్లనీరు గార్చుచు
కాళ్ళకును, చేతులకును వేయఁబడిన సంకెళ్ళబాధ కోర్వలేక
తన తల్పమునకు బోయి బరుండెను. ఇతని నింకను కొంతకాల
ము జతురోపాయముల బరీక్షించి చూచెద గాకయని నళిని
చెరసాల ద్వారమును బంధించి భీగములను గావలి వాండ్రకిచ్చి
చీకటి చాటున తన పరిచారిక యగు ప్రభావతితోఁ తననిజసద
నమునకుఁ బోయెను.

—o—

## పదియవ ప్రకరణము.

---

### విలువిద్య.

మోహనునకు అయిదవ సంవత్సరము వయస్సురాగా
భీమపాలుఁడు వానిని పాఠశాలకు బంప నుద్దేశించి, శుభము
హూర్తమును జ్యోతిష్కులచే నిశ్చయించి, పాఠశాలోపా
ధ్యాయుల రప్పించి వారికిఁ దగు మర్యాదల జేసి బాలురకు
పప్పుబెల్లములఁ బెట్టి తన హృదయానందమును వెల్లడించుటకై
బాలురకు బహుమతుల నిచ్చి ఉపాధ్యాయులకు ధోవతులను
బహుమతులనిచ్చెను. మోహనుఁడు పిన్నవయస్కుఁడగుటచే

ఆటలయందు అమితోత్సాహుఁడై కాలమును గడుపుచు బాలశాలకు బోవుచుండెను. సప్తవర్ష ప్రాయుఁ డగుసప్పటికి విద్యా మాధుర్యము నెఱింగి నిత్యము బాలశాలకుఁ బోయి, విద్య నభ్యసించుచుండెను. దశవర్ష ప్రాయుండగునప్పటికి, భీమపాలుఁడు మోహనుని సకలశాస్త్రముల యందును బండితుని చేయ నుద్దేశించి శాస్త్రజ్ఞుల బిలిపించి వారితోఁ మోహనునకు శాస్త్రములఁ జెప్పి బండితుని జేయుఁడని ప్రార్థించెను. పండితులు భీమపాలుని యాజ్ఞానుసారమైన యాతని గోర్కెను దీర్చెదమని జెప్పిరి. పదిహేనవ వత్సరము వచ్చునప్పటికి కావ్యనాటకా లంకారముల యందు మిగుల నిపుణుని జేసిరి. పదహారవ వత్సర జన్మదినోత్సవము నాఁడు భీమపాలుఁడు పండితులనెల్ల రప్పించి వారికిఁ దగు బహుమతుల నొసంగెను.

విలువిద్యయందును కత్తిసామునందును, యుద్ధముసందును, వేటాఁడుటయందును, మిగుల కీర్తి వడసిన హరితసింహుని రప్పించి వానికిఁ దగు మర్యాదలఁ జేసి, వానితోఁ మోహనకు, విద్యను సాంతముగఁ చెప్పవలయునని కోరెను. అందులకు హరితసింహుఁడు సమ్మతించి 'ప్రభూ! మోహనునకు విద్యను గరపవలెనన్న అతని నిచ్చోటఁ నుంచరాదు. ఈపట్టణమునకు, సుమారు మూడుమైళ్ళ దూరముననున్న అడవికిఁ బోవలయును. అచ్చటఁ ఒక శాలనొకటి నిర్మించుకొని అచ్చటనే నివసించుచు, సాధకఁ జేయవలసియుండును. అనుగ్రహింతురేని మీ

యాజ్ఞచొప్పున నెరవేర్చెదను.

కత్తిసాము విలువిద్యల నభ్యసించుటకు, విశాలమైన స్థలముండవలెను. మన సైన్యము లభ్యసించు స్థలము పిన్నవయస్కులకు బనికిరాదు. భీమపాలుఁడు కుమారుని విడచి యెట్టులుండగలనని చింతించుచు, కుమారుఁడు విద్యావంతుఁడు గావలెనుగదా యని ధైర్యమూని హారితసింహునితోఁ పదియారవ వత్సరమునను, పదిహేడవ వత్సరమునను మాత్రమె విద్యను గరపవలసినదిగ కోరెను. కొందరు సేవకులు హారితసింహుఁడు జూపిన స్థలమునకు బోయి ఆ స్థలమును శుభ్రపరచి రాజతనయుఁ డుండుటకు భవనమును నిర్మించిరి.

శుభముహూర్తమున బయలుదేరి మోహనా, హారితసింహులు, అభ్యాసశాలకుఁ బోయిరి. హారితసింహుఁడు మోహనునకు మొదట పెక్కురకములు అస్త్రవిద్యను నేర్పెను. శబ్దభేది విద్యయందు మోహనుఁడు మిగుల నిపుణుఁడయ్యెను మొదట బాణవిద్యను నేర్పినతరువాత కత్తిసామును నేర్పెను. కత్తిఁ డాలును బట్టుకొని శత్రువులఁ నెటుల నెదుర్కొనవలెను యెట్లు ప్రాణాపాయము గలుగకుండ జాగ్రత్తగ నుండవలెను, అను పలురకముల నేర్పి కత్తిసామునందుఁ మిగుల కృతార్థునిఁ జేసెను.

మోహనునకు పదిహేడవ సంవత్సరాదిని జన్మదినోత్సవమును జరుప నిశ్చయించి సేవకులను అభ్యాసశాలకు బంపి

మోహన, హారితసింహులను రప్పించిరి. ఆ దినమున మోహ నునకు తైలాభ్యజనాది కృత్యముల జేయించి యూరేగింపు టుత్సవమును జరిపిరి. హారితసింహునకు గురుదక్షిణగ కొంతధన మును, విలువయైన వస్త్రములను బహుమతినిచ్చి పండితులకు గొప్పదక్షిణలిచ్చి పామరులకు అన్నదానము చేసిరి. పౌరులెల్ల రును రాకొమరునకు, వారి వారికిఁ దోచినటులెల్ల కట్నముల జదివించిరి. పురమంతయు ఆనందాబ్ధిపై దేలెను.

మోహనజయంతి జరిగిన మఱుచటి యుదయమునను మఱల హారితసింహుఁడును మోహనుఁడు, మరిగొందరు సైని కులును అభ్యాసశాలకుఁ బోయిరి. అచట మూఁడుదినములు గడచెను. నాలవదినమున యధావిధిగ విద్యాభ్యాసమునకు బోయి, మోహనుఁడు మందిరమునకు విశ్రాంతిఁ గైకొనుటకు వచ్చెను. అట్టి తరుణమున వ్యాఘ్రమొకటి గాండ్రు గాండ్రు మని అరచుచు లేడినొకదాని దరుముకొని వచ్చెను. మోహ నుఁడు దానిఁజూచి బెబ్బులి నెటులైన సంహరింపవలెనను యుద్దేశ్య ముదయింప, ఆయుధములఁ చేతఁబూని దానిని తరుమ ప్రారంభించెను. ఆ బెబ్బులి లేడివెంట దట్టమైన అడవిలోనికిఁ బోయెను. మోహనుఁడు దాని ననుసరించి బాణమును సంధిం చెనుగాని అది పులికి దగులనందున, కోపముతో మరియొక బాణమును విడచెను. అదియును దగులనందున పులివెంటఁ బరుగెత్తెను. పులి లేడిపైఁబడి దానిని జంపి పొట్టను జీల్చి

మాంసమును దినుచుండెను. మోహానుఁడు సమయ మదియె యని వాఁడికోలను సంధించెను. అది యకస్మాత్రమ్ముగ వక్షము లోనికిఁ జొచ్చెను. శత్రులెవరో వచ్చియుండిరని మాంసమును మెక్కుచున్న యా బెబ్బులి శరవేగమున బరుగెత్తి వచ్చు చుండ పులి వచ్చుటను జూచి దరిదాపునున్న బూరుహాముపై కెగఁబ్రాకి గూర్చుండెను. మధ్యాహ్నము మూడుఘంటలు కావచ్చెను. మోహానుఁడు పలహారమును గైకొనసంపున క్షు ద్బాధాబీడుతుఁడై నీరసమున ఆచెట్టుపై నిద్రదేవతనుపూజింప ప్రారంభించెను. శత్రులెవరును గానఁబడవంపున బెబ్బులితన దారిని బోయెను.

నిద్రదేవతను గొలుచుచున్న మోహానుఁడు చెట్టుపై నుండి జారి క్రిందనున్నరింటఁ బడెను. పడినవెంటనె మెలకువరాగా నమ జాగ్రతతో చేతుల నానుకొని లేవలేక గూర్చుండెను.

బెబ్బులి కేకలనువిని దరిదాపునున్న కోయవాండ్రు పులిని వెదకుచు దానిని వేటాఁడుటకు బయలుదేరిరి. బెబ్బులి శ్రమచే, సేదదీర్చుకొనుటకై యొక పొదలోనికి జొచ్చెను కోయవాండ్రు పులిని వెదకుచు మోహానుఁడుండు ప్రదేశము నకు వచ్చిరి. హేమభాస్కర ప్రభా సమానుడై పొదపై గూ ర్చున్న మోహానుని జూచి దేవపుత్రుండని యెంచి కడు నుత్సా హాముతో వానినెత్తుకొని తమ పల్లెకుఁ గొనిపోయిరి. ఆ రేయి అంతయు కోయవాండ్రు తమ ఆనందమును వెలిబుచ్చుచు

నాట్యము చేయఁబూనిరి. రాత్రింతయుఁ గడచెను. మోహనుడు ఖిన్నుఁడై గూర్చుండి బెబ్బులి! బెబ్బులి యని కలవరించెను. కోయలు తమ ప్రభువునకు బెబ్బులి కావలయునేమోయని దలంచి పులిని దీసుకొనివచ్చుటకై కొందరు పోయిరి.

కాకులుకూయ ప్రారంభించెను. తూర్పుకొండ తెలుపు బారెను. కొంతకాలములోనె గగనమంతయు రక్తసిక్తంబైన రణరంగముమాడ్కి ప్రకాసింప మొదలుబెట్టెను. సహస్రకరుఁడు కాలోచితకర్మముల నాచరించి భూభాగము నంతను కాంతివంతముఁజేయ రథారూఢుండై యానముసేయ బయలుదేరెను. స్వర్ణభాస్కరుఁడు రజితభాస్కరుఁ డయ్యెను. మధ్యాహ్నము అభ్యాసశాలనుండి విశ్రాంతిఁ గైకొనుటకు వచ్చిన మోహనుఁడు గానరానందున హరితసింహుడును, భటులును విభ్రాంతులయి కొంతతడవు విచారించి ఆయుధములా యింటఁ లేకుండుటఁ గాంచి మృగముల వేటాఁడుటకు బోయెనేమొ యను సందేహముదయింప కొలదిమందిభటులతో నయ్యరణ్యమునకు మోహనాన్వేషణార్థమై బయలుదేరిరి. మూడుమైళ్ళవైశాల్యముగల అడవినంతను గేకలిడుచు వెదకిరిగాని మోహనుని యానవాలు యిసుమంతయైనను గానరానందున హరితసింహుని హృదయాంతర దుఃఖము హెచ్చె. ధైర్యమూని, తోడి భటులకు ధైర్యమును బురికొలిపి మరల మోహనుని వెదకుటకై బయలుదేరెను. సుమారు క్రోసుదూరము పోఁగా

అచట వారొక కోయపల్లెను గాంచిరి. ఆ పల్లెయందు మేళ తాళ వాద్యముల సందడులు వినవచ్చెను. కోయపల్లెయందుండు నేమో యను అనుమానాంకురము జనింప అచటికిఁ బోయిరి.

పల్లెయందొక వటవృక్షముగలదు. ఆచెట్టుచుట్టును రచ్చబల్ల యొకటి కట్టఁబడి యుండెను. అచ్చట గోయవాండ్రిందరును గుమిగూడి ఆనంద సరోవరంబున జలక మాడుచుండిరి. కొందరు నృత్యము చేయుచుండిరి. కొందరు పాటల బాడుచుండిరి మఱిఁ గొందరు కంజెరులను వాయించుచుండిరి. మరి కొందరు సితారులను మీటుచుండిరి. మరికొందరు తప్పెఁదాగి చెట్టుచుట్టును దిరుగుచుండిరి. ఆ రచ్చబల్లపై పెద్దతలపాగలను జుట్టుకొని కొందరును, తలగుడ్డలను కట్టుకొని కొందరును గూర్చుండిరి. కోయలమధ్యఁ మోహనుఁడు ఖిన్నుఁడై గూర్చుండియుండెను. హరితసింహుఁడును, వానితో బోయిన భటులును మోహనుని జూచినంతనె అత్యాశ్చర్యమున అత్యాతురతో వానివద్దకు బరుగెత్తిరి. హరితసింమోహనుడమితానందహుని జూచినంతనె పరవశుఁడై లేచి వానిని కౌగలించుకొనెను. కోయలందరును నిశ్చేష్టులయి వారిని శేరిబారి జూచుచుండిరి. హరితసింహుఁడు నిట్టూర్పుఁ విడచి కోయలందరికిని మోహనుని వృత్తాంతమును జెప్పెను. కోయదొరలు వారికిఁ దగు మర్యాదలఁ చేసిరి. నాటి మధ్యాహ్నము మోహనా హరితసింహులు తమ అభ్యాసశాలకు బోయిరి. అభ్యాసశాలయందు మూడుదినములుగడపి తమ

నిజపట్టణంబగు రత్నగిరిజేరిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

### సుందరిజననము

మాణిక్యచూడుఁడామెను మిగుల గౌరవాతిశయముల గాపాడుచుండెను. సుశీల, భర్తకును తనకును గలిగిన వియోగముచే మిక్కిలి దుఃఖించుచుండెను. రెండుమాసములు గడచెను. గర్భవతి యగుటచేఁ రంగారి ఆమెకు పెక్కు వుపచారములఁ జేయుచుండెను. పదియవ మాసమున సుశీల ఒక కుమార్తెను గనెను. మాణిక్యచూడుఁడు వాని ఆచార పద్ధతిని స్నానాదికృత్యములను జేయించెను. శిశువునకు గావలసిన పాలు మొదలుగాగల పదార్థముల నన్నిటిని గొనిదెచ్చి మాణిక్యచూడుఁడిచ్చుచుండెను.

మూడుమాసములు గతించెను. సుశీలకు మనోవ్యాధి వలన శరీరమునందు రుగ్మత హెచ్చెను. ఆ వ్యాధికి భిల్లులు తమ యౌషధములనెల్లఁ నుపయోగించిరి, గాని సుగుణ మిసుమంతయైనను లేదు. ఒకనాఁడు మధ్యాహ్నము, సుశీల మాణిక్యచూడునితోను, రంగారితోను, తన ప్రాణము నిలువనేరదనియు, అప్పసి బలికను జాగ్రతతోఁ గాపాడి పోషింప వలసినదనియు జెప్పి యొక తాళపత్రము పై తనచరిత్రమును, జగత్సిం

హుని వృత్తాంతమును క్లుప్తముగ వ్రాసి వారికిచ్చి దాని నా బాలిక మెడలో నొక యానవాలుగఁ గట్టవలసినదని చెప్పి కండ్లనుండి నీరుగార్చుచు, ప్రాణములఁ బాసెను. రంగారి మాణిక్యచూఁడులు సుశీలయొక్క మరణమునకు మిగుల ఖేద మొంది ఆమెకుఁ జేయవలసిన కర్మల నన్నిటిని జేసిరి. పశిబాలి కను జాగ్రత్తతోఁ బెంచుచుండిరి. ఆ బాలికను సుందరియను ముద్దునామమున బిలుచుట వారికి యలవాటయ్యెను.

సుందరి కైదేండ్ల ప్రాయము వచ్చెను. ఆమె ఆడుకొ నుటకు లేడిపిల్లలఁ దెచ్చి కోయదాదులు బెంచుచుండెడివారు. మాణిక్యచూడుఁడు నాగరికతయందు అనుభవము గలవాఁడ టగుచే నాబాలికకు విద్యాభ్యాసముచేసెను. సుందరి రంగారిని అమ్మా యనియు, మాణిక్యచూఁడుని బాబా యనియు బిలుచుచుండెను.

పదిసంవత్సరములు గడచెను. సుందరిని కోయలెల్లరును అల్లారు ముద్దుగఁ బెంచుచుండిరి. పండువదినములు వచ్చినప్పు డెల్ల కోయస్త్రీలు నృత్యగీతములతో మాణిక్యచూడుని దర్బారును ఆనందవీధులనూరేగించుచుండిరి దినదిన ప్రవర్ధమా నముగఁ సుందరి యుక్తవయస్క రాలయ్యెను. పదునాల్గు వత్సరములు గతించెను. పటహోసవ సంవత్సరమున యొకనాఁడు కోయలందఱు కొండదేవత నారాధించి వారి రాజగు మాణిక్య చూఁడుని మందిరమునకు వచ్చి మాణిక్యచూఁడుఁడు రంగారి

సుందరుల సమేతుఁడై గూర్చునియుండ బలహారముల దెచ్చి యిచ్చి నృత్యముతోను, సంగీతముతోను, కొంతకాలము గడిపి వారి నానందడోలికల నోలలాడించిరి. సభ ముగియగనె వారు భోజనములకు బోయిరి.

అప్పటికి పగలు పండ్రెండు గంటలయ్యెను. భోజనానంతరమున మాణిక్యచూడుండును, వాని సేవకులును వేటకై బోయిరి. ప్రభాకరుఁడు తన కరములతో తేజమునంతను ప్రసరింపఁ జేసినందున విశ్రాంతి గైకొనుటకై పశ్చిమదిక్కున జేరి గగనమునంతను స్వర్ణమయముఁ జేసి అంతర్ధానయ్యెను. మాణిక్యచూడుఁడు వేటయందు అలసటఁజెంది, విశ్రాంతికై గృహమునకు చేరెను. మాణిక్యచూడుఁడును రంగారియును సుందరితోఁ గూర్చుండి ఆమెతో నేవో సంతోషముగ ముచ్చటించు సమయమున సుశీలయొక్క మరణవిషయము వారిజ్ఞప్తికిరాగా మాణిక్యచూడుఁడు కండ్లనీరు వటవటఁ గార్చెను.

అంతఁదనుక సంతోషముగఁ పలుకచుండిన తండ్రి కంటినుండి నీరు కాల్వలై పారుటఁ జూచి, ఏమికారణమొ యని రంగారిని ప్రశ్నించెను. రంగారియు నిశ్చేష్టురాలై కొంతతడవూరకుండెను. అంత మాణిక్యచూడుఁ డామెను చేరఁజేరి ఆమె మెడలోఁ గట్టబడిన యా తాళపత్ర తాయెత్తును వానికిమ్మనెను. సుందరియు అతండు కోరినయటుల తాయత్తునిచ్చెను. మాణిక్యచూడుఁడు దానిని విప్పుచు కండ్లనీరు గార్చుచు,

ఆ పత్రమును జదివి దానియందుండు వృత్తాంతమును బూస గుచ్చినటుల జెప్పెను. వారే తలిదండ్రులని భావించుచుండిన యా సుందరి మోము రక్తహీనం బయ్యెను. కొంతసేపటికి సుందరి కండ్ల నీరుగార్చుచు, మాణిక్యచూడునివద్దకుఁ జేరి నిలచియుండెను. మాణిక్యచూడుఁ డామె నోదార్చి ధైర్యము ను బూనుమని హెచ్చరించెను. రాత్రి తొమ్మిది గంటలయ్యెను వేటబడలికచే నావహింపఁబడి నిద్రకు తావునిచ్చెను. సుందరి యొక్క మనస్సు పరిపరివిధముల సంచరింపఁ మొదలిడెను. రంగారి ఆమె నోదార్చి నిద్రించుటకు బోయెను. సుందరి మనో వికలత జెందినదై తల్లికొఱకు లోలోపల విలపించి బంధీకృ తుఁడై యున్న తండ్రిని జూడవలయునని యు, విశ్రాంతిఁగైకొని కుక్కుటములు గూయువేళఁ బయలుదేరి బోవ నిశ్చయించు కొనిరంగారితో నిద్రించుటకు బోయెను. తండ్రిని జూడవలయు నను కాంక్షయుండుటచే ఆమె కంటికి యిసుమంతయు నిద్ర రానందున యోచనాపరురాలై యుండెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

### ఈ ర్ష్య.

జగత్సింహుని నే నిదివఱలో రెండు పర్యాయములు నా కోర్కెఁ దీర్పవలసినదని కోరియుంటిని. అతఁడేకారణముననో

నా మాటయన్న జెవిఁ బెట్టకుండెను. భార్యా వియోగుఁడై చెరయం దున్నప్పటికిని, వానిని నేను చెరవిముక్తుని చేసెదనని జెప్పియున్నను, యిసుమంతయైనను జ్ఞానోదయము గాకున్నది. ఎన్నిమారులు వానికి హితోపదేశము చేసియున్నను వానికి దుర్గుణమేఁ ప్రధానముగ నున్నది. నన్నేలుకొనుము, నా వలన నీవు సుఖ మనుభవింపఁగలవు అని జెప్పియున్నను, తానుపట్టిన కుందేటికి మూఁడే కాళ్ళుగలవని యనునుగాని, యికాంత తన్నెందులకు ఆశ్రయించి దాక్షిణ్యమున కొడఁబడు చున్నదో యని యోచించు భావమేల అతనికి లేదో నాకు దోచుటలేదు! యోగ్యుఁడైన జగత్సింహునకు యిట్టి దుర్గుణములు కలుగుట వలన అతనికి మిత్తి ప్రాసన్న మగుచున్నదని తలఁచుచున్నాను అతని పొందును గోరి మృత్యువు ఆసన్నమైనదని తలచుట శ్రేయస్కరమా? హృదయమా! నీ వెంతటి కఠినోక్తులబల్కు చుంటివి? అయినను యీ పర్యాయముగూఁడ వానియొద్దకుఁ బోయి ప్రయత్నించెదను. అని తలంచుచు సోఫాపై గూర్చుని యుండెను.

దివాకరుఁడు పశ్చిమాద్రినలంకరించెను. ఆకసమంతయు మేఘములతో నిండి యుండెను. గాలి బోరుమనుచు వీచుచుం డెను. ప్రజలందరును దివాకరుని వేడిమివలన మిక్కిలి బాధ నొందుచుండిరని యోచించిగాబోలు దయార్ద్ర హృదయుఁడై వరుణుఁడు తన పరివారమును, నీరముల నేలపై వెదజల్లుడని

బంపెను. నీరదములన్నియు తమ యేలిక యాజ్ఞప్రకారము వర్షింపబయలుదేరి కొద్దిబాటువర్షము గురిపించి, భూమినంతను జలముతోc దడిపి, వాటియాస్థానములకుc బోయెను.

ప్రభాకరుcడు భూమ్యోపరిభాగమున నున్న జలజవాయువును వేడిపరచుటకై మఱల మేఘముల చాటునుండి తొలcగి చూచెను. కర్షకులందఱు వారివారి గృహములకుc జేరుచుండిరి. పక్షులెల్ల గూండ్లకు జేరుచుండెను. పశువుల కాపరులెల్ల పశువులను యిండ్లకు దోలుకొనివచ్చుచుండిరి. భీమపాలుcడు నళిని మందిరమున కానాcడు రావలెనను యుద్దేశ్యమున మోహినీ మందిరము నుండి బయలుదేరు నప్పటికి వర్షము గురియుటచేc దెరుపు యిచ్చువరకు వేచియుండి మఱల బయలుదేరెను. రథము నళిని మందిరము చేరెను. సేవకులు తమప్రభువునకు వందనము లాచరించి స్వాగతమిచ్చిరి. భీమపాలుcడు రథమును దిగి లోనికిcబోయెను. నళిని వానిరాకc నెఱిcగి తమ నమందిరమునుండి బయటకు వచ్చి తగు గౌరవము చేసెను. భీమపాలుcడు సోఫాపై గూర్చుని నళినిని జూచి, "మదీయ వలపురాణి నేడేలకో యోచనా తత్పరయై యున్నటుల దోచుచున్నది' అని బలుకc జిరునవ్వు నవ్వుచు, "మీకు అట్టి అభిప్రాయ మేలకలిగెనో యని నా కాశ్చర్యము గలుగుచున్నది' అని పలికెను.— "నా మాటలకేల ఆశ్చర్యము గలుగుచున్నది?'—అని వదనారవింద చిహ్నములే తెలియcజేయు

చున్నవి—మీరు యిట్టి వింతమాటలనే బలుకుచుందురు. నేఁ డేదియో కాలము బండినది. గాని-చో యీనాఁడు తమరు యిచ్చోటికి వచ్చియుందురా?—ప్రియసీ! దాని కాశ్చర్య మొందెదవేమి? నిత్యము వచ్చుచుండినటులే వచ్చియుంటిని. మన మోహనుఁడు అభ్యాసశాలనుండి యీ యుదయమున తన గురూజీ సమేతుఁడై వచ్చెను. అచ్చట మోహనునకు ప్రాణాపాయమైన గండమొకటి గడ చెనటసుమా? నళిని ఆశ్చ ర్యముతోఁ ఏమీ మన ముద్దుల మోహనుఁడు వచ్చెనా! అభ్యాసశాలయందు గండము గడచెనా పాపము, ఆ బాలుడు యీవఱ కెన్నఁడును, యిట్టిగష్టము నొందియుండలేదు. అని బలికెను—భీమపాలుఁడు కొంతసేపు విశ్రమించి తన భవన మునకు పోబోయెను. నళిని భర్తపై మిక్కిలి అనురాగము గలదానివలె నటించి, "నాథా! యీ దినమున నా యంతఃపుర మున నుండరాదా! నాకు శరీరారోగ్యము చెడినట్లు దోచుచు న్నది. శిరోబాధ హెచ్చగుచున్నది. నాథా! కొంతతడవు విశ్రమింపుఁడు. ఔషధమును దెప్పింపుడని కండ్లనీరు గార్చెను. భీమపాలుఁడు నళిని వీపుపై తట్టి " అబలా! యెందులకట్టి యధైర్యమునకు తావిచ్చుచున్నావు? ధైర్యము వహింపుము. నీకు వలసినన్ని యౌషధములను బంపెదను: వాటిని సేవించి నచో ఆరోగ్యము గలుఁగగలదని చెప్పి మందిరమునకుఁ బోయి, ఔషధములను బంపించెదననుచు సోఫామీదనుండి లేచి రథ

మువద్దకుఁ బోయెను. నళిని వానివెంటఁ గవాటమువద్దకు బోయి, నా ప్రార్థనల నేనాఁడు మన్నించిరి? ఎల్లప్పుడును, యిదే విధముగ బోవుచుడిరి. నాపై అంత నిర్థయులై యుండుట మీాకు తగునా, ధర్మమా యని బలికెను. భీమపాలుఁడు రథముపై గూరుచుండి, హృదయేశ్వరీ! పోయివచ్చెదనని బలికెను. రథము భవనము దాటినది. నళిని తలుపును బిగించి లోనికిబోయి, మంచముపై గూర్చుండి, నా ప్రార్థనల నాలకించి వల్లెయనినచో నా ప్రియత్నములన్నియు, బూడిదలోఁ బోసిన పన్నీరగునుసుమీా! భగవంతుఁడు నాపై తన కరుణా కటాక్షమును ప్రసరింపఁజేసి నాపలుకుల నాలింపకుండఁ జేసెను. ఇది అంతయు నా భవిష్యత్కార్యముల కెంతయోమేలుగావున నా ప్రియత్నములపై నుండెదనని తనలో తలంచుకొనుచు బరుండెను.

ముత్యములవలె నక్షత్రములన్నియు తమ క్రొలదికాంతిని ప్రసరింప జేయుచుండెను. మండూకములన్నియు తనివిఁదీఱ నీరములగ్రోలి బెకబెక యనుచుఁ గూయుచుండెను. నల్లని మేఘములు తారలనన్నిటిని తమచెక్కిళ్లతో గప్పుచుండెను. పురవీధులన్నియు చీగటిచే గప్పఁబడి నిర్జనంబై యుండెను. కావలివాండ్రు మొదటితూరి కావలిఁగాచి తమ వాసంబులకు బోయిరి. సుమారు పండ్రెడుగంటల కాలమయ్యెను. నళిని సర్వాభరణాలంకృతయై నల్లని మేలిముసుగు వేసుకొని

పరిభానతి సమేతయై కారాగారమునకుఁ బయలుదేరెను. కారాగృహ కాపరులకు తనరాకనెఱింగించి, కారాగారాధిపతితో నేమేమొ గొంత రహస్యమును మాటలాడి వాని యొద్దనున్న బీగములను గైకొని జగత్సింహుఁడు బంధింపఁబడిన బంధఖానకుఁ బోయి, తలుపును దెరచెను. జగత్సింహుఁడు మనోవ్యాధి గ్రస్తుండై పరుండియుండెను. నళిని మెల్లఁగ లోపలకువెళ్ళి, "నా మనోహరి! జగత్సింహా యని' నెమ్మదిగ లేపెను. శృంఖలాబద్ధుండై యున్న జగత్సింహుఁడు యులికిపడి లేచి, "అమ్మా! మీరీ యర్ధరాత్రమున యిచ్చటి కేలవచ్చిరి? స్త్రీలకు యిట్టి సాహసము తగదు. ఎన్నిపర్యాయములు, మీ యుద్యమమును మానుకొనుఁడని బ్రతిమాలుకున్నను, నా మాటల నన్నిఁటిని ద్రోసిపుచ్చుటకు, మీ మనంబేల యోచించినదో నాకు ఆశ్చర్యము గలుగుచున్నది. తల్లీ! మీరు అతి త్వరితముగ నావలకుబొండు. నన్నీ కడసారి బ్రాణములతో బ్రతుకనిండు నా ప్రార్థనల నాలకింపుడు అని కండ్లనుండి నీరు గార్చుచు నళిని పాదములపై బడెను.

నళిని రెండుమూఁడడుగులు వెనుకకు వేసి, పైనున్న మేలిముసుగును దొలగించి, 'నా మనోనాథా! నన్నేల యీ మన్మథ దావానలనమున గాల్చుచుండిరి? నా మాటలఁ బెడ జెవినిఁ బెట్టి నన్నేల హింసించెదరు? అహింసా. పరమోధర్మ—యను వాక్యమును ఏమంటగలిపితిరి? నన్నీ విషాద సాగరము

నుండి దేల్చి నా ప్రాణరక్షణము సేయుఁడు. స్త్రీహత్యా దోషంబున క్రోడిఁగట్టుకొందురు. చిన్ననాట నుండియు మీపై వాంఛాపరురాలనై యున్న నన్నీ కష్టముల బాలుసేయుట మీకు యశస్కరమా? నా మనోభీష్టమును నేరవేర్చుటకు సమ్మతింతురేని మిమ్మీ నిమిషములోనె కారాగార విముక్తుల జేసెదను. ఈ కారాగారంబంతయు నా చేతియందిమిడియున్నది. గావున తిరస్కరింపక నా మన్మథాగ్నిని జల్లార్పుడు' అని పలికెను.

జగత్సింహుండు చెవులుమూసుకొని, పరమేశ్వరా! పంకజ నయనా! నన్ను యింకను యెందులకు సజీవునిగాఁ యుంచితివి? నేను జననమొందినదాదిగ యించుకేనియుఁ దుష్కృత్యముఁలఁ జేసియెఱుఁగ. నన్నేట్టిదౌర్భాగ్యునిఁజేయనెంచుచుంటివో నాకుఁ గోచరమగుటలేదు అని తలఁచుచు, నళినితోఁ అమ్మా! మీరీ ప్రియత్నముల మానుకొనుఁడు సకల సన్మండలమునేలు, భూపతితోఁ గాపురముసేయకఁ యిట్టిదుష్కార్యముల కేటిల సాహసించుచుండిరి? మీ పుత్రునిగ యెంచినన్ను మన్నింపుడు' అని పలికెను.

నళిని తోకఁ ద్రొక్కిన త్రాచుభంగి కోపోద్దీపిత మానసియై 'ఓయీ జగత్సింహా! నీ పలుకులన్నియు కర్ణగఠోరములుగ నున్నవి. నీ హితోపదేశము లిచట బనికిరావు. నిన్నాశ్రయించి, నీకరుణాకటాక్ష వీక్షణములకై పరితపించుచున్న

నన్ను భవత్పాదసేవఁ జేయుటకు సంసిద్ధురాలనై యున్న నన్ను భవదూప్రియూషవ్వన వయోవిలాసములవలన బంధింపఁబడిన నన్ను మన్నించినచో నీప్రాణములు నీకుఁదక్కును గాఁకున్నచో నిరర్థకములగును, అని బలికెను. మీకు అట్లు చేయవలయునను యిచ్ఛయే యున్నచోఁ అట్లేగానిండు అని జగత్సింహుండు బలికెను. పండ్లఁపటపటఁ గొఱుకుచు "ప్రాణములపై యాశ ఉన్నచోఁ యోచించుకొనుము. ఇంక నీప్రాణములు నీకు దక్కవు' అని బలుకుచు, గవాటమును బంధించి బీగములను కావలివానికిచ్చి ప్రభాపతిసమేతయై తన నిజసదనమునకుఁ బోయెను.

— —

## పదమూడవ ప్రకరణము.

—o—

### జన్మదినోత్సవము.

ప్రాగ్దిశఅంతయుఁ దెల్లబారెను. మిక్కిలి మత్తుగనున్న ప్రజలనందరిని మేల్కొల్పుటకై సహస్రకరుఁడు తన వాడికరములతోఁ బైబై కెగఁబ్రాకఁజొచ్చెను. ఎరుపుగనున్న తూర్పుదిక్కంతయు అపరంజికాంతితోఁ మెఱయుచుండెను. జనులందఱును ప్రభాకరుని రాకకై వేరచి తమతావులను విడచి వారి వారి ప్రయత్నములపై బోవుచుండిరి. స్త్రీలు జ్యేష్ఠాదేవికి వీడుకోలుసన్మానముగావించి లక్ష్మికి స్వాగతముమిచ్చుచుం

డిరి. నిద్రదేవతను పూజించుచున్న వారందఱును పూజలను చాలించి బయటికి వచ్చుచుండిరి. స్వర్ణ భాస్కరుఁడు రజితభాస్కరుఁడై తన కిరణములతోఁ వేడిమిని వెదజల్లుచుండెను. నగరమంతయు ననంతకళ్యాణముగ నలంకరింపఁబడెను. పురవీధుల న్నియు పచ్చని తోరణములతోఁడను వైజయంతులతోఁడను నిండియుండెను. నిద్రించుటకు బోవునపుఁడులేని యీ వైజయంతుల గాంచునంతనె స్త్రీపురుష ప్రేక్షకులకు ఆనందము హెచ్చయ్యెను. ఆశ్చర్యముతోఁ వింతఁ జూచుచుండిరి.

తలియూరు ఒకఁడు డప్పు నొకదానిని చేతఁబూని "యీా దినం మన యువరాజుగా రుట్టిన పద్దెనిమిదో పుట్టిన రోజుకామట్టి, యిందుమూలంగా తెలియసెప్పే దేంటంటె, ప్రభువులు చేయిత్తున్నా సంతర్పణానికి పేదా సాదా, అందఱు రామోసిందొహాోయి—మఱి మఱి సెప్పేదేంటంటె రైతాంగ మోారు, బాపనోరు, ఉత్సవం సూడటానికి రామోసిందో హాోయి! అని గేకవేయుచు—యింకా సెప్పేదేంటంటె మన పట్టంలోవున్నా మఱికాళ్ళోరంతా సేపల్ని పట్టి, సేపల్నిపట్టి యెవరుతెత్తే ఆరికి ప్రభువులోరు, బహుమానా లిత్తారంటూ హాోయి,' అని దండోరా వేయుచుండెను. వినినవారందరును మిక్కిలి ఆనందముతో యువరాజుగారు పుట్టిన దినమటయని చెప్పుకొనుచుండిరి.

మోహనునకు తైలాభ్యంగనాది కృత్యములదీర్చి

నూతనవస్త్రాలంకృతుని జేసిరి. పండిత పామరులకు నెల్లఁ గొప్ప బహుమతుల నిచ్చిరి. కుంటి గ్రుడ్డి వాండ్రకు అన్న వస్త్రదానము చేసిరి. మధ్యాహ్నము మూఁడుగంటల కాలమయ్యెను. భీమపాల మహారాజు మోహనా మోహినీ సమేతుండై సభ జేసెను. దేవదాసీలు నృత్యము చేయుచుండిరి. మంత్రి సామంతాదు లందరును కొలువును దీర్చియుండిరి. నళిని కొంతసేపటికి వచ్చెదనని వర్తమానముఁ జేసెను.

అగ్నికుల క్షత్రియులు అందరు నగరకాసారము సంతను వేటాఁడి పెద్దపెద్ద చేపలను గంపలోఁ వేసుకొని రాజభవనమునకు దెచ్చుచుండిరి. యోగి వచించునపుడు ప్రభావతి విషయముల నన్నిటిని సాంగోపాంగముగఁ విని వానినంతను తను రాణియగు నళినితో మచ్చటించెను. నళిని ఆ విషయముల నన్నిటిని తన హృదయ కుహరమున దాచి తగిన సమయ మిదియెయని ప్రభావతితో తన మేడపై గూర్చుండి హేమచ్ఛాయగనున్న మత్స్యమును దెచ్చువానిఁ లోనికి రావలసినదని గేక వేయుటకు నియమించెను. ప్రభావతియు అందులకు సంతసించెను. వీథులన్నియు జనసమ్మర్ధముగ నుండెను. ఎచ్చోటఁ జూచినను మంగళవాద్యములె—ఎచ్చోటఁ గాంచినను భజనలె—ఎచ్చోటజూచినను నృత్యగీత వాద్యములె— ఎచ్చోటఁ జూచినను కడుపార ఆశనములును గోష్ఠి ఆనంద మహా మహాటులాడుకొనుచు యువరాజును దీవించు బ్రాహ్మణులె

గొప్ప సంభావనలను వడసి శాల్వలు వలివాటు వేసుకొని, ఘూరీచంబులఁ చేతఁబూని రాజసౌధమునుండి బ్రాహ్మణులు వచ్చుచుండిరి. విలువిద్యయందు ఆరితేరి విద్యావంతులెల్లరు తమ విద్యానైపుణ్యమును జూపి బహుమతులను పొంది తమ ఆయుధములను బూని వచ్చుచుండిరి. రక్షకభటులందరును బారులఁదీర్చి నిలచియుండిరి.

సుమారు నలుబదియేండ్ల ప్రాయముగల అగ్నికుల క్షత్రియుఁడొకఁడు బొజ్జను కదల్చుచు బంగారమువలె మెర యుచున్న మత్స్యమును, మఱికొన్ని మత్స్యములను గంపయం దుంచుకొని రాజమందిరమునకు వెళ్ళుచుండెను. సౌధోపరిస్థా గమునుండి ప్రభావతి వానిఁజూచి అతిత్వరితముగ మేడనుండి దిగివచ్చి అతనితో—మహారాణిగారు నిన్ను లోపలికి రావల సినదని ఆజ్ఞ యిచ్చియున్నారు. అని చెప్పెను ఆ వలయకా యుఁడు ప్రభావతి మాటల నాలకించి సంతోషముతో నళిని మందిరమునకు వచ్చెను. ప్రభావతి గంపను లోనికిఁ గొనిపోయి రాణియెదుటఁ బెట్టి చేపను దీసెను. ప్రభావతి ఆశ్చర్యమొంది ప్రభావతితో—"నీ యుక్తివలన యీ చేప నోటియందున్న ముత్యాలహారమును దీయుము" అని చెప్పెను. ప్రభావతి చేపను లోనికి దీసుకొనిపోయి నోటియందు వ్రేళ్ళునిచి దం డను మెల్లగ దీసి నళినివద్దకుఁ దెచ్చెను. అంత నళిని యువ్వి ళులూరుచు ప్రభావతితోఁ మన ముత్యాలహారమును చేపనో

టియం దమర్చుము' అని చెప్పఁ బ్రభావతి ముత్యాలహారమును నోటియందుంచి తనచాతుర్యముచే ముత్యాలహారమును నోటియం దమర్చెను. ఇట్లు చేయుటచేఁ జేప పాడై యుండదా యను సంశయ ముదయింపవచ్చును గాని ప్రభావతి మిక్కిలి జిత్తులమారియు, చతురతయు నైనదగుటచేఁ జేపకావంతయైనను అపాయము వాటిల్లకుండ హారమును దీసి మఱల హారమును అమర్చఁగలదయ్యెను. చేపలను మనరాణిగారు జూచెనది యిటుఁదెమ్ము అని ప్రభావతి పట్టుకొనివెళ్లినది. యింతవఱకును దెచ్చి యిచ్చినదిగాదు. కారణం బేమైయుండునని యా బహుకాయుఁడు మిగులతత్తర మొందుచుండెను. ప్రభావతి చేపలను గంపయందుఁ బెట్టి తనకొఱకై వేచియున్న యా భీమగాత్రున కిచ్చెను. పరీక్షింపక పరమానంద భరితుఁడై ప్రభావతికి దణ్ణము బెట్టి వెలుపలికి బోయి, సాటివారితోఁ గలసి రాజమందిరమున కేగెను.

మంత్రి యా అగ్నికుల క్షత్రియులతోఁ వారు తెచ్చిన చేపలను బైటికిదీసి పరచియుంచుడని ఆజ్ఞయిచ్చెను. అంగడివలె, జాలర్లు వారు తెచ్చిన చేపలను జాగ్రతగ పరచియుంచిరి. మంత్రి ప్రతివానివద్దకుఁ బోయి, చేపలను పరీక్షించెను. మొదటి రెండువరుసల యందున్న, యోగి చెప్పిన చేప గానబడ[illegible] మూఁడవ వరుసకు బోయి పరీక్షింపఁగా బహుకాయుని [illegible] లయందు శోభాయమానమగు మెఱయుచున్న మత్స్యమును [illegible]

నయ్యెను. మంత్రి వానిని గంపఁ జేతబట్టుకొని రాజసభకు రావలసినదని చెప్పి మిగిలినవా అందరికిని దగు బహుమతులనిచ్చి బంపెను వారును సంతోషించుచు తమ యిండ్లకు బోయిరి.

మంత్రి యీ అగ్నికుల క్షత్రియుని తన వెంటఁ రాజసభకు గొనిపోయెను. భీమపాల మహారాజు చేపను జూచినతోఁడనె ఆశ్చర్యానందములదులఁదూగుచు, నూరు రూప్యములను వానికి ఇనాముగ నిచ్చెను. ఒకేసారి నూరు రూప్యములఁ గాంచుటచే అమితానందమున ఆ అగ్నికుల క్షత్రియుడు వంగివంగి దండములబెట్టుచు సభామంటపమును విడచెను. స్వర్ణచ్ఛాయనున్న మత్స్యము నాలుగు చీరికలుగ చీల్చబడెను. చేప నోటియందు ముత్యాలహారము కనబడెను. యోగి వచించిన దంతయు సత్యమగుచున్నదని అచ్చెరువొందెను. దండను దీసి కడిగి పూజించిరి

నళిని ముత్యాలహారము మనకుఁ జిక్కినదిగదా భీమపాలుని, యువరాజును కీలుబొమ్మవలె త్రిప్పవచ్చునుగదా యని తలచుచు, ముత్యాలహారమును కడిగించి జాగ్రత్తగ దానిని పెట్టెలో వేసుకొనెను. తనయునకు అపమృత్యు గండములన బాధ తొలంగెనుగదాయని భీమపాలుఁడు సంతోషించుచుండెను. సుమారు అయిదుగంటలు కాలమయ్యెను. సభముగియలేదు. మోహనుఁడు తలిదండ్రుల వద్దనుండి లేచి తల

నుబట్టుకొని, 'శిరోబాధ గలుగుచున్నది—శిరోబాధ—'అని కేకలువేసెను. శిరోబాధయని మోహనుఁడు కేకవేయగనే భీమపాలుఁడు మూర్ఛాగతుఁడయ్యెను. ఆనందమందిరము విషాదమందిర మయ్యెను. ప్రేక్షకులందఱు కండ్లనీరు గార్చుచు—"చచ్చినవాని కండ్లు చారడేసి—'యన్నట్లుగ ఆకాశ మందిరములను గట్టుచుండిరి.

"నాయన్నా! సంతానహీనులమై భగవంతునిగూర్చి నోములఁ వేయి నోచితిమి. మా పూర్వజన్మ సంచయ మిట్లు పరిణమించెను. సంతానహీనులమైన మా జన్మలఁ తరింపజేయువా రుందురా యని తలచితిమి. భగవంతుండు మాపై తనకరుణాకటాక్షమును ప్రసరింపజేసి, మాయవేషధారియై యోగిరూపమున మా మందిరమునకు వచ్చి, మా మందిరమును పావనముచేసి మాకొక ఫలంబు నిచ్చెను. ఆ ఫలము భుజించిన తరువాతనె గర్భవతినై వరప్రసాదుండవైన నిన్ను గంటిని—కుమారా—కుమారా—మమ్మెంతయో నుద్ధరించెదవు—దివ్యతేజంబవై యిప్పుడంబు నేలుదువని యూహించితిమిగాని—మమ్మో * *—దుఃఖసాగరమున ముంచెదవని కలలోనైన దలంచి యుండలేదుగద * *ఓ దేవతుల్లారా! ఋషులారా! మా ముద్దుల మోహనుని బ్రతికింపనెంచరా? హాకుమారా! ముద్దుల మోహనా—నా తనయా—* * * యని మిగుల దుఃఖించుచు మూర్ఛనొందెను. సభికులును, మం

త్రి సామంతాది దాసీజనంబులును, వారికిఁదగు శైత్యోపచారములఁజేసిరి. భీమపాలుఁడు దిగ్గున లేచి కుమారునివంకఁ జూచి గుండెలు గొట్టుకొనుచు — తనయా — తనయా — మా — మా — మమ్మేల యీ దుఃఖాంధకారమున విడచెదవు? మమ్ములను జూచుటకు నీకు మనస్కరింపదా? — యోగిపుంగవుండు వచించినదెల్లఁ సత్యమేయని నమ్మితిమిగాని — నాయనా — నీవే గొప్పకొండ — నీ వలననే మాజన్మములు తరించును. మాకు యిక ఏమి కొదువ యని దలంచుచుంటిమిగాని — మమ్మిట్టి దుఃఖాంధకారమున విడచెదవని కలలోనైన గనియుండ లేదుగద — ఓ పరమేశ్వరా — దీనదయాళూ! మా ముద్దుల మోహానుని మా కొసంగుము, అనుచు మఱల మూర్ఛనొందెను.

మోహినీ మందిరమున జరుగుచున్న అల్లకల్లోల మంతయు నళినికిఁ దెలియఁ వేగముగ నందలములోఁ గూర్చుండి తనమందిరమునకు వచ్చి అత్యాతురతతో మోహానునివద్దకుఁ బోయి కన్నీరు గార్చుచు నాయనా — ముద్దులమోహానా మాకెంత యాపదఁ గలిగించితివి? తనయా పరప్రసాదుండవై గూడఁ మమ్మి ఖేదాంధకారమున విడచెదవని కలనైనను గని విని యుండలేదుగద — మా కేదియో ఉపకారమును జేసెదవని యనుకొంటిమిగాని యిటుల......అనుచు గుండెలఁ గొట్టుకొనుచు, పాపమా చిలుకలకొలికి నటనా నాటకరంగ

పాత్రధారియై యెంత దుఃఖించినదోగద! భీమపాలుఁడు లేచి, ధైర్యమువహించి జాతకము వ్రాయించినరోజున యోగివచ్చిన పలుకులఁజ్ఞప్తికిఁదెచ్చుకొని అచటనుండువారికిధైర్యమును బురికొలిపి, దాసీలతోఁ మోహనుని బరుండబెట్టుటకు గదిని సిద్ధపరచుఁడని యాజ్ఞనుయిచ్చెను.

గదిగోడలకు యెల్ల వేయఁబడియుండెను. గోడలకు విశాలమైనపెద్దవగు గవాటములు గవాక్షములు గలవు. గోడలయందు లోహముతోఁ దయారుచేయబడిన లతలు అమర్చబడెను. మధ్య నొక మంచముగలదు. దానిపైఁ మెత్తని పరుపు గలదు. ఆ పరుపుపై నానావిధ పరిమళ కుసుమలను, సుగంధ ద్రవ్యములను జల్లిరి. లోహలతలయందు అంబరుపుల్లలు వెలిగింపఁబడెను. అట్టి తల్పముపై మోహనుని పరుండఁబెట్టిరి. తొగసూడు పశ్చిమాద్రి నలంకరించి సుమారు రెండుఘంటలు కావచ్చెను. భీమపాలున పలుకులవిని పౌరులెల్ల వారివారి గృహములకుఁ బోయిరి. తనయుని పైనుండు వాత్సల్యమున మోహిని మిగుల విలపింపఁగాఁ ఆమెకు బిచ్చెత్తెను.ఆమెకొంతసేపు తనలోఁ దానెనవ్వుకొనును, తలఁ విరబోసుకొనును. కండ్లనెఱ్ఱఁజేసి చూచుచుండును. కట్టుయుడుపులఁ జీల్చుకొనును, ఒక్కపెట్టున గోలబెట్టుచుండెను. భర్తపైఁబడి యేడ్చుచుండును.

కుమారునివలన గలిగిన మోసమును, మోహినియె...

దుస్థితియుఁ భీమపాలుని విచారమును హెచ్చుజేసెను. భీమపాలుఁడు మోహినిని గాచుటకై యిఱువుర దాసీలను నియమించెను. అన్నపానాదులఁ గ్రోలక తనయునిపై నుండు వాత్సల్యముచే దుఃఖించుచు బరుండెను. రాజమందిరము ఛాయాదేవికి చోటునిచ్చినదో యన్నటులుండెను. నళిని శకటముపై తన మందిరమునకుఁ బోయి మోహినీ భీమపాలురకు దగినశిక్ష భగవంతుండే విధించెనని సంతసించుచు, మిక్కిలి విచారము గలదానివలె నటించుచు మందిరములోఁ బ్రవేసించెను.

మోహినికి మెలకువ వచ్చినపుడెల్ల పూల నోడిలోఁ బోసుకొని తనయుఁడు బరుండియున్న గదిలోనికి బోయి, దుఃఖించుచు, పూలను వానిపై వేయుచు, పిచ్చిచేష్టలవలన యొడలు దెలియక దిరుగుచుండెను.

---

## పదునాలుగవ ప్రకరణము.

### ఆ నా టి రా త్రి.

రాత్రి సుమారు మూఁడుగంటలు కావచ్చెను. కోయవాండ్రందఱును గాఢముగ నిద్రించుచుండిరి. మాణిక్యచూడుఁడును మిక్కిలి బడలికచే నిద్రించుచుండెను. తండ్రిని చూడవ[illegible]సను యుద్దేశ్యమున సుందరి తన హృదయవీధిని యోచనా[illegible]థములతో గప్పెను. కుక్కుటములు గూఁయుట విని

పక్షికయందుఁ బరుండియున్న రంగారిని దప్పించుకొని వెలుపలకు వెళ్ళ కావలివాండ్రు నిద్రించుటఁ జూచి, తరుణము చిక్కినదని యోచించి, చిన్ననాటనుండియు బెంచి పెద్దజేసిన తలిదండ్రులను బాయవలసి వచ్చెగదాయని విచారించుచు మాణిక్యచూడుని బసవిడచి తండ్రినిచూడ ప్రయాణమయ్యెను జనసమర్ధములో మెలగని దగుటచే భయంకంపితయై అగోచరమగు మార్గమునఁ బోవుచుండెను.

కొంత దవ్వేఁగినంతనె అరణ్యమార్గమున బోవలసివచ్చెను. తోవ గనఁబడుటలేదు. వ్యాఘ్రములు గాండ్రు గాండ్రు మనుచు కేకలు వేయుచుండెను. కురంగములు వాఘ్రఘోరారావముల విని పరుగులిడుచుండెను. చిన్ననాటనుండియు యరణ్యమునందుండు మృగముల కేకల వినినదగుటచే భయ మానంతయును లేక తన మార్గమున బోవుచుండెను. అల్లారుముద్దుగ బెరుగుటచేతను, యిదివఱ కెన్నండును, నడచియుండని దగుటచేతను కమఠయాత్రజేయుచుండెను. అరుణోదయమై సుమా రారుగంటలు కావచ్చెను. మార్గ మగోచరముగ నుండెను. భుజించుటకు హారమేమియును లేదు. నడువలేక, నడువలేక డస్సినదై యొక బూరుహముగ్రింద గూర్చుండెను. కష్టకాలము వచ్చుటచే యామెకు హృదయతాపము గలుగ 'హా పరమేశ్వరా! నా కెట్టికష్టములను గలిగించితివి. నా కెందులకిట్టి బుద్ధిగలిగినది, తమ పుత్రికవలెఁ బెంచి [illegible]

దానినిజేసిన మా బెంపుడు తలిదండ్రులతో నా యుద్దేశ్యమును వెలిబుచ్చినచోఁ వారే నన్ను నా తండ్రియగు జగత్ప్రింహుని యొద్దకు గొనిపోయి వానిని జూపించియే యుందురుగద! నేనిట్టి దుష్కృత్య మొనర్చినందులకు వారు ఎంత చింతించుచుండిరో గద! నా తల్లియగు సుశీల నన్నేల గన్నది? తన ప్రాణముతో నా ప్రాణములను గొనిపోయినచోఁ నేనిట్టి దుష్కృత్యము నొనర్చియుండనుగద — నే నెంత దౌర్భాగ్యురాలనో — కోయ వాండ్రిందరు నన్నెంతఁ దూరుదురోగద — "ఓ జగదీశ్వరా! నా వలన నేర్పఁబడు కార్యమొకటియులేదు — నాకీ ప్రాణము లతోఁ బనిలేదు — ఈ శరీరమునం దింకను ప్రాణములుండి నచో యిట్టిదుష్కృత్యములను వేయింజేయు. గావున నాప్రాణ ములను గొనిపొమ్ము — చిత్రగుప్తా! నీ లెక్కలలో నన్నేల నమూదు చేయవు? అమ్మా!సుశీల రాజువిధించిన శిక్షవార్తను వినినంతనె ఎంతఁ దుఃఖించితివోగద! న్యాయా న్యాయములఁ యోచింపక భీమపాలుఁడు నీకెట్టిశిక్ష విధించెనోగద! ఆహా! కాలమహిమ? యీపాడు ప్రాణములపై యిసుమంతయైన ఆశలేదుగావున నన్ను నీలోఁ జేర్చుకొనుము. అని చింతించుచు దెలివి దప్పినదై చెట్టు క్రింద నిద్రించెను.

సాయంకాలము మూడుఁ గంటలయ్యెను. సుందరి గాఢ నిద్రనుండి మేల్కాంచినదై లేచి — "దాహము —' అని కేకలు వేసెను. అరణ్యమున నరసంచార సూన్యంబై యుండుట

ప్రసరింపజేయుచున్న నక్షత్రముల తిలకింపఁబడిన జాతినీలము మాడ్కి ప్రకాశించుచున్న కవచమును ఆకాశవాణి ధరించెను. సుందరి కోటద్వారమువద్దకు వెళ్ళెను. అచట గావలి గాయుచున్న భటులు యేదియో మాట్లాడు కొనుచుండ మెల్లమెల్లగ నుద్యానవనమున బ్రవేశించి తరుచ్ఛాయల యందు మోహినీ భవనము వద్దకు చేరెను.

రాత్రి సుమారు రెండు యామము లయ్యెను. నళిని కారాగారామునకుఁ బోయి, జగత్సింహునితోఁ మాటలాడ నుద్దేసించి పయనమై యేలకో నా రేయిఁ బ్రయత్నము మాని మెడలోనున్న ముత్యాలహారమును తనతల్పశిఖమునకుఁ దగిలించెను. ఆ ముత్యాలహార ప్రభావ మేమియోగాని నళిని హారమును దీసినంత మాత్రమున మోహనునకు స్పృహగలుగ లేచి యెంతయో గాఢనిద్రఁ జెందితినని దలఁచుచు శయ్యాతలమున నున్న జలమును ద్రాగి గవాటమును దెరచి మేడనుండి క్రిందికి దిగెను. గదినద్ద గావలియున్న సేవకులు బుస్సలు గొట్టి నిద్రించుచుండిరి.

సుందరి మెల్లమెల్లగఁ సౌధ సోపానముల వద్దకుఁ బోయి నచ్చటఁ గూర్చుండి యెవరైనను జూచి భాధింతురే మోయను భీతిచేఁ నేదియో యోచించుచు గూర్చుండెను. శశి కరుఁడప్పుడే చెట్ల చాటునుండి లేచి తన కాంతినంతను ప్రసరింపఁ జేయుచుండెను. సోపానములవద్ద గూర్చున్న యావనితా

గాంచి దాసియేమొ యని దలంచుచు, "ఓసీ! నీ వెవతవె; యేకాకివై యిచ్చటేల గూర్చుంటివి? నీ తోడివారేరి' యని ప్రశ్నించెను. సుందరి వానిఁ జూచినంతనె భీతిచే వడకుచు, యొకప్రక్కగ నిలచి తలయొంచి నిలచియుండెను. మోహనుని ప్రశ్నకు నుత్తరువు నీయ సందేహించి, శిగ్గుచే యూరకుండెను మోహనుండు ఒక మెట్టును దిగి "ఓ కాంతా! నీ వెవతవు? యిచ్చటి కేలవచ్చి యుంటివి? యీ నిశీధమున యొంటరివై యుండుటకు కారణ మేమి? యని ప్రశ్నించెను. సుందరి సిగ్గు నభినయించుచు 'ఆర్యా! నా దీయూరుగాదు. మాణిక్యచూడుఁడను వానిచేఁ బెంచఁ బడితిని. నా తలిదండ్రు లెవరో నాకుఁదెలియదు. ఈ పట్టణ ప్రాంతముననె యోగి పుంగవుడు వచించిన చొప్పున తమ భవనమువద్దకు వచ్చి తమరాకకై వేచియుంటిని. నన్ను సుందరి యని బిలుచుట కలదు.—

"మోహను డత్యాశ్చర్యముతోఁ కాంతా! నీదీయూరు గాదందువే, యీ కోటలోని కెటులఁజొరబడితివి. స్త్రీవయి యుండియుగూడ యింత సాహసింప వచ్చునా? నా రాకకై వేచియుంటివా! (స్వగతముగ) కలయా, ప్రత్యక్షమా, యనిదలం

చుచు, అయినను నాతోఁ నీ కేమిబని. సుందరి, "యువరాజా! భగవంతుని కటాక్షముండినచోఁ స్త్రీనయి నన్ను సాహసింప గలరు.—' మేలిమి బంగరుచాయ మేనెల్లఁ మెరయుచుండిన యకాంతామణి పలుకులన్నియు మోహానుని దయార్ద్రహృద యునిఁ జేయఁ "లలనా! నాతో నీకేమి బనియున్నది; నాతో డఁ బనియున్న వారెవరును లేరె! నీ కార్యమెద్దియో త్వరిత ముగఁ వచించివుము'—సుందరి యా సుందరాంగుని హృదయ బంధముచే బంధింపబడి 'ఆర్యా! మీతో నా వంటి వనితల కు— * *పనియేమై యుండునో యూహింపరాదా! మోహా నుఁడు చిరునవ్వు నవ్వి, లజ్జా భీతులులేక నాతో యీ వని తారతమ్యము బలుకుటకు కారణ మేమైయుండును. అయినను మరల బ్రశ్నించెద ననుచు, 'యువతీ యోగి పుంగవుఁడు నీతో నేమి వచించెను; సుందరి కొంతతడ వూరకుండి.....నీవు, భీమపాల తనూజుండును, యువరాజును అయిన సుందర స్వరూ పుండగు మోహానునకు* * * * భార్యవు * * * గాఁగ లవు. అని చెప్పియుండుటచే మీ పాదసేవ చేయుటకు వచ్చిన దానను— "ఓకాంతా! సాహసించి యిటులేల పలుకుచుంటివి? తుంటరి ప్రలాపనమువలన ప్రాణభంగము గూడఁ గలుగ గలదు. ఇందుండవలదు. తక్షణమే యిచ్చటనుండి యావలకు బొమ్ము. సుందరి చింతించుచు, 'ఆర్యా! గడ్డము తాత వచిం చుటచే వచ్చియుంటిని గాని* * '—మోహానుని హృదయ

మేలకో——...' కాంతా! నీ పలుకు లేలకో నా కాశ్చర్య మును గలిగించుచున్నవి. నాకు సేవజేయుటకు వచ్చిన దానవా?' అనుచు సుందరిని సమీపించి—నీవీ వరలోఁ బలి కెన బలుకులను మఱల బలుకుము! సుందరి భయకంపితయై — 'నా అపరాధమును మన్నింపుడు. తమ ఆజ్ఞప్రకార ము నేనావలకు బోదును—"యని పలికెను. మోహనుఁడు సుందరి చేయిఁబట్టుకొని—'బేలా! అట్లు పలుకుచుంటివేల? నీ హృదయ మెట్టిదో యని ప్రశ్నించితిని?' మోహనుండామె కరమును బట్టుకొనినంతనె యామె హృదయ ముప్పొంగ హృద యేశ్వరా! యని పిలువ సంసిద్ధురాలయ్యెను. మోహనుఁడు మోహపాశ బద్ధుండై 'సుందరి' యనుచు మేడమీఁదికి దోడ్కొని పోనెంచి, రెండుమూఁడు మెట్లునెక్కి, ఏకారణము మునసో అచ్చటనే గూర్చుండెను. సోఫానములపై గూర్చుండి వారిరువురు నన్యోన్యముగ సంభాషించు కొనుచుండిరి. నళిని నిదురనుండి లేచి శయ్యా తలపమున నున్న ముత్యాలహార మును మెడలో వేసుకొని మఱల బరుండెను. మోహనాంగితో మోహమున నన్యోన్యముగ సంభాషించుచున్న మోహను నకు శిరోబాధ గలుగ శిరస్సును సుందరి యూరువుపై నునిచి, సుందరీ!—సుందరీ!—శిరోబాధ—శిరోబాధ యనుచు కండ్ల నుండి దుఃఖభాష్పములు జార చేష్టాశూన్యుఁడయ్యెను.

---

## పదునేనవ ప్రకరణము.

—o—

### అ న్వే ష ణ ము .

మాణిక్యచూడుడును రంగారాయుడును నిద్రనుండి లేచిరి. సుందరి వారివద్ద లేకపోవుటచే వారు మిక్కిలి కలతజెంది సేవకులను, సుందరి — కోయపల్లెయందు గలదేమొ — వెదకుడని నియమించెను. కోయపల్లె యందు సుందరి లేదు. అప్పుడు మాణిక్య చూడుడును రంగారియు సుందరి కొఱకు మిగుల దుఃఖించిరి. గతరేయి జరిగిన చరిత్రఁబట్టి యామె తండ్రిని చూడనేగ నేమోయని దలంచిరిగాని, సుందరికి తన తండ్రిని చూడవలయునను యుద్దేశ్య మున్నదో మాతో వచించియే యుండును. యొంటరిగా యావలకు బోయినపుడే మెకము నోటఁబడెనేమో యని భిన్నాభిప్రాయమును కోయ పెద్దవచించెను. మాణిక్యచూడుఁడు వారి మాటలఁ బాటింపక కొలది సేవకులతోఁ సుందరీ యన్వేషణార్థమై బయలుదేఱెను. ఏమార్గమున బోయినదో యను అభిప్రాయమున అరణ్యమునంతను వెదకిరి. గాని సుందరి జాడలు గానరావయ్యెను. మాణిక్యచూడుఁడు ధైర్యము వహించి జగత్సింహుఁడు చెరసాలకు బోయినచో సుందరి చరిత్ర దెలియునగునని దలంచుచు, పరివారముతో రత్నగిరికి బయలుదేరెను. ఆహారములలై కొనకపోవుటచేఁ వారు పట్టణ సమీపమున వంటలఁ

జేసుకొని భోజనములఁ జేసిరి. దివాకరుఁడు పశ్చిమాద్రినలంకరించెను. నిశీథమున జెరసాలకుఁ బోవుటకు వీలుగనుండునని యోచించి, వటవృక్షముగ్రింద విశ్రమించిరి.

రాత్రి సుమారు పదకొండు గంటలయ్యెను. మాణిక్యచూడుఁడును మువ్వురు భటులును గలసి కారాగృహమువద్దకు బోయి, త్రాటి యాధారమున కుడ్య గవాక్షములగుండా జగత్సింహుఁ డేగదియందుండె నేమోయని జూచి యాగదికప్పునకు రంధ్రమును జేసి త్రాటిని లోనికివేసి దాని యాధారమున లోపలకు మాణిక్యచూడుఁడు దిగెను. గావలివాండ్రు పహరా నిచ్చుచుండిరి. మాణిక్యచూడుఁడు రహస్యముగ నొక గోడవద్దఁ దాగియుండి సమయమునకై వేచియుండెను. కారాగారమును గాయుచున్న భటుఁడు నెమ్మదిగ గజ్జెలమ్మవారిని బూజించుటకు మొదలుబెట్టెను. తరుణము లభించుటచే మాణిక్యచూడుఁడు మెల్లగ జగత్సింహుని యొద్దకుఁ బోయి "—సోదరా!జగత్సింహా' యని లేపెను.జగత్సింహుఁడు దిగ్గున లేచి విభ్రాంతుడై—నాయనా! మీ రెవరు— నాకు గోచరమగుటలేదు. మీ నామంబును జెప్పుడని యనెను. "భాయీ! నన్ను మఱచితివా! నన్ను మఱచితివా!" యని మాణిక్యచూడుఁడు మఱల ప్రశ్నించెను. 'మిత్రమా! నీ వెవరవో నేనంతగా గుర్తింపజాలను. నీ పేరెమో జెప్పుడు—' అని మఱల జగత్సింహుఁడు ప్రశ్నించెను. 'సోదరా! నేను మాణిక్యచూడుఁడను నన్ను నీవు గుర్తింపజాలక యుండవచ్చునుగాని, నిన్ను

నే నెఱుంగుదును — 'జగత్సింహుఁడు నిశ్చేష్టుండై కొంతతడ వూరకుండి హృదయాంతర దుఃఖము నాపుకొనజాలకమిక్కిలి విలపించెను. మాణిక్యచూడుఁడు వానితోఁ ధైర్యోక్తుల నాడి '— సోదరా! భయమొందవలదు. నేడో రేపో నీవు కారాగార విముక్తుఁడవు కాఁగలవు.' అని చెప్ప, అట్టి భాగ్యము నాకుఁ గలుగునా యని లేచి వాని కౌఁగలించు కొనఁబోయెను గాని, శృంఖలాబద్ధుండగుటచే లేవలేక పోయెను. ఇంతలో నేదియో చప్పుడయ్యెను. మాణిక్యచూడుఁడు జగత్సింహునితోఁ మాటా డుట మాని గోడచాటున దాగియుండెను.

నళిని ముత్యాలహారమును మెడలో వేసుకొని, కరవా లము నొకదానిని యొఱలో బెట్టి, నడుమునకుఁ గట్టుకొని యా నడిరేయిఁ మారువేషమున ప్రభావతి సమేతయై, కారా గృహమునకు వచ్చెను. కావలివాండ్రు నిదిరించుచుండుటచే గావలివాండ్ర వద్దనున్న తాళములను గైకొని కారాగార రహ స్యద్వారమును దెఱచి జగత్సింహుఁడు బరుండియున్న వేదికవ ద్దకు వచ్చి నిలచి 'జగత్సింహా! జగత్సింహా! నిద్రించుచుంటివా! మెలఁకువవచ్చినదా? నేను నళినిని. నీ పాలిట బిశాచమును — పి శాచరినై యీ నడిరేయిఁ నీ ప్రాణములఁ దీయవచ్చిన దాన ను. ఇప్పటికైనను జ్ఞానము కలిగినదా? ఇంకనైనను నా కోర్కె నుదీర్తువందువా? ముమ్మాటికిని నా కోర్కెను నెరవేర్పబ్రియ త్నింపుము. లేనిచోఁ యిదిగో! యీ నా కరవాలమునకు నిన్ను బలిగా నొసంగెదను. అనుచు కత్తిని యొఱనుండి దీసి

పై కెత్తెను. జగత్సింహుఁడు కండ్లనీరు గార్చుచు, 'అమ్మా! తమ యభీష్టప్రకారమె సేయుఁడు. నేటితో నాకున్న సర్వదుఃఖ దరిద్రములును దీరిపోయినవి. తమ యాజ్ఞప్రకారము మీ కరవాలమునకుఁ బలియిచ్చినచోఁ నేనే కారాగారము నుండి విముక్తుఁడనై నా ప్రాణముల విడచెదను. తల్లీ! యోచింపక నన్ను గడఁదేర్పుము' అని పలుక, నళిని తలయూపుచు, "ఓయీ జగత్సింహా! జగత్సింహా! ముమ్మాటికిని—ముమ్మాటికిని— నా పలుకుల నాలకింపవా? నాకోర్కెను దీర్పనందువా? నేటితో నాకును, నీకును, వియోగము సంప్రాప్తమైనది. మఱల గడువు నిచ్చుచున్నాను యోచించుకొనుము. నా కోర్కెను దీర్చెదననుము. నీకుఁ జావు తప్పును—నా ప్రాణములీ పాడుదేహమున నున్నంతకాలము నీ కోర్కెను దీర్తునని బలుకఁజాలను. యిచ్చవచ్చినచోఁ ప్రాణము లుంచుము. లేనిచోఁ కరవాలముతో నా శిరమును దీయుమని బలుక—నళిని పండ్లుపటపటఁ గొఱుకుచు, కత్తినిపై కెత్తి వానిశిరము నూడదీయుటకు సంసిద్ధయై యున్నప్పుడు చాటున డాగియున్న మాణిక్యచూడుఁడు కత్తిని బట్టుకొనెను.

---

## పదునారవ ప్రకరణము.

### దొంగ దొరికెను.

కండ్లనుండి నీరు గార్చుచు, 'యిట్లేలద్రోహము చేయు

చుంటివి? నీదివ్యచారిత్రము నంతను మెఱుఁగని దాననైన నాతోఁ బరిహాసమేల? ఆహా తెల్లవారుచున్నదే! కోడి కొక్కురోకోయని కూయుచున్నదే! నేనిచ్చోట నుండినచో నన్ను మీ సేవకులు శిక్షింతురే, మీ గాఢనిదురనుండి లేచి నాకే దేని తావును జూపుడు. లేనిచోఁ నేనిచ్చట నుండజాలను. రాకుమారా! లేలెమ్ము. నన్నుగాచి రక్షింప వేగమె లెమ్ము' అని గద్గద స్వరముతోఁ బలుకుచుండెను. మూర్ఛితుఁడైన మోహనుఁడు లేచునా? సుందరిని గాచువారెవరు? అయినను విధిం దాటువారుగలరా? ఋచటీ మోహనుని విడిచి నే పోయి నచో యిత డిచ్చటికేల రాగలిగెను. యెట్లువచ్చెనను విషయము రాజా రాణులకు సందేహ ముదయింపదా? దీని నిజస్థితిని దెలసికొనుట దుర్లభము. నాకెన్ని కష్టములు గలిగినను నేనిచ్చోట గూర్చుండి దీని నిజస్థితిని దెలసికొందును. గీకువాటిల్లిన వాటిల్లుగాకఁ యీ మోహనాంగుఁడు నా హృదయమును దొంగిలించి నాకిట్టిమోసము జేసెను. ఈ రాసుతుని విడువను. యోగి వచించినదెల్ల గొంత సత్యమెగాని, అతఁడు నాతోఁ యిట్టి యిక్కట్టులు వాటిల్లునని చెప్పియుండలేడె. అతడెందుల కూరకుండెను. భగవత్సంకల్పమెట్లు జరుగనై యున్నదో జూచెదగాక' అనుచు దనలో తా నూహించుకొను చుండెను.

దర్బారు మందిరమున ఐదుగంటలు కొట్టిరి. కాకము లెల్ల 'కావు, కా' వని గూయుచు పిల్లలకు మేతఁ దెచ్చుటకై

తమ గూండ్లనువిడచి పోవుచుండెను. పురవాసులెల్లరును తమతె యాత్రలములవీడి తమ తమ కార్యముల నెఱవేర్చుకొనుటకై బోవుచుండిరి. అంతఃపుర దాసీలందరును త్వరితగతిఁ వారికి నియమింపఁబడిన కార్యముల పూర్తి జేయుటకై బోవుచుండిరి. మోహినీ మందిరమునుండి దిగి పరిచారికలు ముగ్గురు వే వేగ నేదియో మాటలాడుచు సుందరీ మోహనులుండు చోటునకు వచ్చిరి. సుందరిని జూచినంతనె వా రత్యాశ్చర్యమున, 'ఓసీ! నీ వెవ్వతవు' కావలివాండ్రచే పోతుటీగ దూరుటకైనను శక్యము గానటుల కావలివాండ్రచేఁ గావలి గాయఁబడుచున్న నిచ్చోటి కెటుల రాగలిగితివి? నీ దేయూరు? భీమపాల మహారాజ సుతుడైన మోహను నిచటికెటుల సాహసించి దొంగిలిగితివి? భూతమవా! పిశాచవా? నీ విచ్చోట యుండినచోఁ నిన్ను మహారాజా భీమపాల్ నద్దకుఁ గొంపోయి నీకు శిక్షవిధించునటుల జేసెదము. నీ చరిత్రము నున్న దున్నటుల జెప్పుము. నీకు ప్రాణాపాయము గలుఁగనేఱదు.సుందరికి వారిని జూచినంతనే కంటినుండి గుబ్బికొనసీరు కాల్వలై పాఱి వక్షోపరిభాగము నంతను దడిపెను. వారి యధికారపుఁ బ్రశ్నలను వినినంతనె యవి యన్నియు ఆమె హృదయముపై పెద్దబండలను బేర్చినట్లుకాఁగా సమాధాన మిచ్చుటకు నోటఁ మాటాడుట లేదు. దాసీ నయంబు లగ్నికణంబులుగ మూర కోపాయత్త చిత్తులై 'ఓసీ! యేల నూరకొంటివి? నంగనాచివలె నటునిటుఁ జూచుట తప్ప యేల మా ప్రశ్నలకు నుత్తరువు నీయకున్నావు. నీప్రా

ణములపై యాశయున్నచో త్వరితముగ సమాధానమిమ్ము. మాప్రశ్నల వలననే నీ కండ్లనుండి నీరు వట వటఁ గారుచున్నదా? నీవు సమాధాన మీయనిచో మఱిన్ని గారును సుమీ!' అని పలికిరి. తెరవులేక సుందరి విచారము నంతను దిగమ్రింగి 'అమ్మలారా! నా దీయూరుగాదు. కోయాధిపతియగు, మాణిక్యచూడుఁడను వాని పెంపుఁడు గూతురను. నన్నుగన్న తలిదండ్రు లెవరో నే నెఱుఁగను. నా విధివశమున యిచ్చోటికి రావలసిన దాననైతిని. మీభూపాల మహారాజు తనూజుండైన మోహనుని నే దోడ్తెచ్చి యుండలేదు. నిన్నటి సాయంతనమున నేనీ పట్టణము సమీపించు నప్పటికి వృద్ధజటధారియొకఁడు, నన్నుఁ జూచి నాతో — యువతీ! నీ దివ్యచరిత్రమునంతను దెలసికొంటిని. ఈ మార్గమున బొమ్ము. రాజమందిరము వద్దకుఁ బోవగలవు. ఈరేయి రాకొమరుడు నిన్ను బెండ్లాడును — అని చెప్పెను. నా జీవిత చర్యయును, యోగి వచించిన మాటల వలనను, నా కాశ్చర్య ముదయింప నాకట్టి భాగ్యమే కలుగునాయని దలఁచి వానికి నమస్కరించి నా బాటరిసి గోటద్వారమునద్దకుఁ వచ్చియుంటిని. కావలి గాయుచున్న భటులు యేదియొ గుస గుస లాడుచుండిరి. సమయము చిక్కుటచే నేను నెమ్మదిగ లోనికి బ్రవేశించితిని. మొక్కల నీడలో మెల్లగ నీ భవనము వద్దకు చేరితిని. అప్పటికి సుమారు పండ్రెండు ఘంటలు కావచ్చెను. మీరెవరును మేల్కొని యుండలేదు. నేను నెమ్మదిగ సౌధశోపానముల వద్దకువచ్చి

గూర్చుంటిని. మోహనుఁడు గది తలుపులను దెఱచి క్రిందికి దిగివచ్చుచు, రెండవ సోఫానముపై నిలచి వివిధ విధముల బ్రశ్నించెను. ఆయన ప్రశ్నలకు నా చరిత్రమును గొంతవరకు జెప్పియుంటిని. మారుఁడుమాపై వాడిశరముల సంధింప మేమి రువురము వాటికి బద్ధులమైతిమి. యోగిపుంగవుండు వచించినది సత్యమగుటచే నే నానందమున శృంగార వినోదముల గొంత సేపు ముచ్చటించితిని. నాతోఁ మాటలాడుచు, శిరమును నా యూరువుపై నునిచి సుందరీ—సుందరీ—శిరోబాధ—శిరోబాధ—యనుచు బరుండెను. ఇంత వఱకును స్పృహగలుగలేదు.

పరిచారికలు సుందరి యొక్క పలుకుల నాలకించి 'యువతీ!— నీ చరిత్రమంతయు మిగుల వోద్యముగనున్నదే? నీవు మోహిని వద్దకు వచ్చినచోఁ యామె నిన్ను మిగుల గౌర వించును. గావున మనమిచ్చోఁట గాలము వ్యర్థపుచ్చక మోహనుని బరుండబెట్టి సుగంధ ద్రవ్యములను జల్లి, రాణి వద్దకుఁ బోదము. తదనంతరము గర్తవ్యంబును యోచింతము.' అని మోహనుని గదియందు బరుండబెట్టి సుందరీ సమేతమై మోహిని వద్దకుఁ బోయిరి మోహిని నిదురనుండి లేచి తన యునికై వగచు చుండెను. దుఃఖించుచున్న యా మోహిని గ్రిక్కున నవ్వెను. వారు సుందరిని దగ్గఱకు దోడ్కొనిపోయి బిచ్చెత్తిన యా రాణితోఁ 'అమ్మా! యీ యువతి గతరేయి మన మోహనునితోఁ మాటాడినదట అరుణోదయముగాకపూర్వము మా కార్యముల నెఱవేర్చుటకై మోహనుని గదివద్ద

నుండి బయలుదేరితిమి. గవాటము దెరువఁబడి యుండుటచే లోనికి బోయి చూచితిమి. మోహనరాజా మా కగుబడనందున మా కాశ్చర్యముదయింప, మీ భవనమునకు వచ్చియుండి రేమొయను యూహచే గ్రిందికిదిగి వచ్చునప్పటికే కాంత మోహనుని శిరమును దన యూరువుపై బెట్టుకొని నేదేదో దలంచుచు విచారించుచుండెను. మేము మిగుల కోపాచిత్తులమై యామెను మందలించి తన చరిత్రమునంతను జెప్పవలసినదని నిర్బంధించితిమి. పాపమీబాల గతదినంబున గడచిన దంతయు మాతోఁ జెప్పినది—యోగిపుంగవుండు మనగోట కనతి దూరమున కనబడెనట. అతఁడీమె నాశ్వీరదించి —నీవు రాజతనయుని చేబట్టుదువు— అని చెప్పెనట. ఈమె చారిత్రమును వినగోరుచో యామె చెప్పుటకు సంసిద్ధమైయున్నది— మోహిని మోహనా— మోహనా—యనుచు దుఃఖించి కొంత దడవూరకుండి—మా ముద్దుల మోహనుండు కాంతతో గతరేయి మాట్లాడెనా! మాటాడెనా సత్యమేనా!—నేనమ్మజాల—మా ముద్దుల మోహనుఁడెక్కడ—మాటాడుటెక్కడ—! మాకుఁదక్క భాగ్యమబ్బునా?—మేము బుత్రశోకమునకు బాలయితిమి—ఓబాలా! నీవు మా సుతుని చూచితివా? గడచిన రాత్రి నీవు మా మోహనునితో మాటాడితివా నీ చరిత్రమునువిన గుతూహలము గలుగుచున్నది—రాణిపలుకుల వినినంతనె సుందరియొక్క భయము పారిపోయెను. సుందరి మోహినితోఁ తన యావద్వృత్తాంతమును జెప్పుచు జగత్సింహుఁడు—

మా—యని చెప్పఁబోయి తత్తరమొందెను. రాణి యామెప లుకులకు సంతసించి—అమ్మాయీ! నీవీ విషయమునుగూర్చి తగు శ్రద్ధవహింపుము. శక్తివంచనము లేక బ్రయత్నింపుమని బలికెను. సుమారు తొమ్మిదిగంటలయ్యెను. ఆకలిచే బీడింపఁ బడినదగుటచేఁ మిగుల హీనస్వరముతోఁ క్షుద్బాధం దీర్పవేయు న పరిచారిక లామెను వంటశాలకు దోడ్కొనిపోయి, ఆమె యాకలిందీర్చి నళిని యుద్యానవన ప్రాంతమునకుఁ బోయిరి.

ప్రభావతి యుద్యానవన పూలమొక్కలకు నీళ్ళు బోయుచుండెను. ఆమెతోడి పరిచారికలు నా యుద్యానవనము నకు మఱియొక నూతన వ్యక్తినిదోడ్కొని వచ్చినందున ఆశ్చ ర్యముతో అక్కా! యీామె దేయూరు? యిచ్చటికెందులకై వచ్చెనని ప్రశ్నించెను. అందొక పరిచారికనవ్వుచు, అక్కా! యీా యువతి దీయూరుగాదు. మన రాజకొల్వునందు పరిచా రికగ నుండగోరి యిచ్చోటి కరుదెంచినది. మన మోహిని రాజ్ఞినిజూచినది. ఆమెయు నామెకోరికకు సంతసించి యిక్కొ లువునం దుండవలసినదని చెప్పినది—'కాంతా! నీ నామధేయం బెద్ది?' నిమీలితలోచనియై "నన్ను సుందరియని పిలుచుట కలదు'—అనెను. సుందరిదక్క మిగిలినవాఅందరును సుందరిని విడచి కొంత దవ్వరిగి నేదియో రహాశ్యముగ గుసగుస లాడు కొని నవ్వుచు సుందరివద్దకుచేరి అక్కా మనమందరము గూఁడి యువరాజగు మోహానునకు వాటిల్లిన దుస్థితిని గనుగొందు మేని మనకురాజ్ఞిగారు బహుమతి నొసంగుదురు—'నా కేమియు

దెలియదు. మీరు చేయుబనులయందు సహాయము చేయ గలను. అతిధైర్యముగ నెంతకీడువాటిల్లు బనినైనను, నిమే షకాలములో పూర్తిచేయగలను. 'నీవుమన రాజకొలువునందు మిగుల ధైర్యశాలివనియును, యుక్తుల జ్యోతివనియును పేరొం దితివి. నీవు శ్రద్ధ బూనకపోయినచోఁ మా ప్రయత్నముల న్నియు అగ్నిఁబోసిన యాహుతి యగునుసుమీ! నిక్కముగ నీవే మాలో పెద్దగ వర్తించి కార్యమునను నిర్విఘ్నముగ నెరవే ర్చవలయును. రహస్యము నెవరు గనుగొందురో వారికి ప్రధమ బహుమానము విలువయైనదే ముట్టగలదు.' బేలలైన మనము యిట్లుతలంపనేల? మోసమేమియు జరిగియుండదు. మనము దురభిప్రాయముఁ బడుచున్నాము—హారము మెడలో వేయుడు మోహనునకుఁ గష్టములేవియు వాటిల్లవు—అని యోగివచించెనే! అటులనే హారము వేచియుండిరి. వేసినను కీడు సంభవించినది—ఆహా! యోగి భగవంతుఁడా ఏమి? యేవియో కల్లబొల్లిలు రాజావారి వద్దవచించి పోవుచుండును. హారముచే పనోటయుండుట సత్యమైనది గాని మెడలోఁ వేయుటచే మృ త్యువు గండదోషము హరించుచున్నది. సత్యమైనదా! కాబట్టి ఎల్లవేళలఁ బరులమాటఁ బాటింపరాదు. ఇట్లొకరి నొకరు మాట్లాడుకొనుచుండిరి. సుందరి—అక్కలారా! మనమీ ప్ర సంగములతోఁ కాలముగడపినచో మన ప్రయత్నమునెరవేరుట కష్టము—'అందొక పరిచారిక క్రోధాయుతచిత్తయై "ఓసీ—! ముందువచ్చిన జెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాడియ

న్నటుల-మాపై నధికారముచలాయించి బహుమతిని నీవే పొం
దగోరెదవా! నీకుఁ దక్కుటనున్న-మా ప్రిభావతి అక్కకే
ముట్టును. మనకు మాత్రము రుచిచూచివిడచిన పాయసమే
యని' కేకలువై చెను. నావలననే యీ కార్యము నెరవేర
వలసి యున్నటుల వీరు మిగుల నన్నే దలపెట్టుచున్నారు.
మా రాణియుజేసిన మోసము వీరుకెట్లు గోచరమైనది. నూతన
ముగ వచ్చిన సుందరి మిక్కిలి నెరజాణవలెఁ గనబడుచున్నది
యోగి దర్శనమైనటుల వచించినది. దివ్యదృష్టిఁజూచి అతండీ
మెతో మా మోసమును జెప్పియుండఁలేదుగద. నాదెంతనీచ
మైన జన్మమైనది. మారాజ్ఞ దుర్మార్గవృత్తికి బాల్పడి, నన్ను
గూడజెరచి తానుజోగియగుటేగాక నన్నుఁగూడ జోగిని జేయ
దలఁచుచున్నది. నేనేల, యోటమి పెట్టినటుల నీచురాలనై
యుండవలయు. యెవరికర్మలకు వారే సాక్షిభూతులు గావున
నిక్కమువచించి, నన్ను యీవరకు మెచ్చుకొనుచున్నను
మిగుల మన్నలఁవడసి బహుమతిని నేనే పొందుదానను. "జెడు
కాలమునకు గుక్కమూతి పింజెలన్నట్లు'-నళినికి జెడుకాలమా
సన్నమైనది. ఈ రహశ్యమికఁ దాచలేను. నేటితో నాకును
మా నళిని రాజ్ఞికిని వియోగము సంప్రాప్తము గాగలదు.మా
నవ్వులచే దూషింపఁబడినను మాయామయుఁడగు నా శ్రీహరిచే
భూషింపఁబడవలయునని ప్రిభావతి యూహించుకొనుచుండెను

అంత పరిచారికలలో నొకతె "అక్కా! మిగుల యో
చించుచుంటివి! మాతోఁ జెప్పగూడనిదా' యని ప్రశ్నిం

చెను. "ప్రియత్నమొల్లుకొన గూరునాయని యోచించుచుంటి ని—' అంతయు నీదే భారము. కార్యమంతయును నీ జేతుల యందిమిడియున్నది.' నేను సాధ్యమగునంతవఱకు మీకుఁ దోడై యుండెదను. నా జీవనాధారమును వీడి సర్వమయుఁడగు యా శార్ఙ్గనికి వెరచి మీతో నొక విషయమును వెలిబుచ్చు చున్నాను. కరుణించి, నన్ను మన్నించి మీ కార్యమును జయ ప్రదముగ నెరవేర్చుకొనుడు మేమునీకన్న బెద్దలమా? నీకు అపాయము గల్గింతు మనుకొంటివా! నీదయ యుండినచో నీయిష్టము వచ్చినటుల మెలఁగుదు—"మోహానునకు జాతక మును వ్రాయించుదినమున నేను మోహిని భవనమునకు వచ్చి యుంటిని. యోగివచించిన విషయముల నన్నిటిని మా నళిని రాణితో వచించితిని. నళినియందు భీమపాలునకు యెక్కువ ప్రేమాతిశయములు గలవు. యోగీంద్రుడు ఫలమును నృపా లునకిచ్చిన నాటనుండియు, ఆ ప్రేమాతిశయములు క్షీణింప మొదలిడెను. భీమపాలుఁ డటులుండుటచే నళినికి యతనిపై యసూయమొదలై ఎట్లయిన రాజును వంచింతమనుయుద్దేశముజ నింప బన్నుగడలఁ బన్నియుండెను. సాధ్యములైన వాటినెల్లనె రవేర్చుచున్నది. మోహానుని జన్మదినోత్సవము నన్ను జేపల పట్టువానిని లోనికిఁ దోడ్తేవలసినదని నియమించినది. దీర్ఘకా యుండొకఁడు బంగారు చాయగనున్న చేపను గంపలోవేసి బట్టుకొని వచ్చుచుండెను. మేడపైనుండి వానింజూచి దిగ్గున క్రిందికిదిగివచ్చి వారిని రాణిగారి యాజ్ఞనుజెప్పి లోపలకురావ

లసినదిగా గేకవేసితిని. నా కేకవిని యతఁడు నావద్దకువచ్చెను. చేపలగంపను లోపలికి బట్టుకొనిపోయి నళిని యెదుటఁ బెట్టి తిని—ముత్యాలహారమును చేపనోటినుండి నీ చాతుర్యముచే దీసిన మన ముత్యాలహారమును చేపనోటియం దుంచవలసినదని నాకు యుత్తరవు నిచ్చినది. నేను జాగ్రత్తతోఁ ఆ ముత్యాల హారమును దీసి మా నళినిగారి కిచ్చితిని. మఱల చేపను గంప లోబెట్టి ఆ దీర్ఘకాయునకు గంప నందజేసితిని. వాఁడునాయాల శ్యమునకు కోపోద్దీపిత మానసుండై నేదియో గొణుగు కొనుచు, గంపను నెత్తిపై బెట్టుకొని పోయెను—మన మోహ నునకు మెడలోవేసిన ముత్యాలహారము నిజమైనదిగాదు. నళిని వద్ద నిజమైన ముత్యాలహారము గలదు. ఇదియే నేను చేయగ లసహాము. గావున ధైర్యమువహించి మీ ప్రియత్నములను నెరవేర్చుకొనుఁడు. ఇంక నా పనిపై బోయెదను. మీ ముప్వ రును, కార్యమును సాధింపవచ్చును. సుందరి మిగులధైర్యవం తురాలుగ గనబడుచున్నది. ఆమెయె మిక్కిలి సహాయ్యకారిగ నుండగలదు.' అని చెప్పి వారివద్దనుండి యుద్యానవనము నం దున్న బావివద్దకుఁ బోయిఁ నీటిని చేదుకొని పూలమొక్కల పిపాసఁ దీర్చుచుండెను.

పరిచారిక లిరువురును సుందరియును కొంతదూరమా యుద్యానవనమునందు దిరిగి మఱల మోహినీ భవనమునకు వచ్చుచుండిరి.' ఈ ప్రిభావతి వైరాగ్యమును బూని నేదియో నొంత విరాగమున ముత్యాలహారమును గూర్చి చెప్పినది.

యిదిసత్యమైయుండునా, యెంతటి రహస్యమునైనను యింతవి చ్చలవిడిగ జెప్పుదురా. అయినను బ్రియత్నింనెదగాక.' యని సుందరి తోడివారితో బలికెను లీల రెండవపరిచారిక కోపముతో, "నంగనాచివలె ప్రభావతి వచించిన దంతయు నస త్యమేమోయని బలుకుచుంటివా? నీవు మాత్రోవచించిన దంత యు సత్యమేనా?' అని బలికెను. సుందరి ఆమె మందలింపుల నాలకింపక—మనలో యెవరు ప్రభువారివద్దకు బోయి మనప్రి యత్న ఫలమునుగూర్చి వచింపఁగలరు? —నేను రాజావారిని జూచుటయెగాని వారితో నెన్నడును మాటాడి యుండలేదు. నే సాహసింపఁజాలను.' అని లాలిసను పెద్దపరిచారిక బలి కెను. "నేను ధైర్యముగ రాజావారి యొద్దకుఁ బోగలనుగాని, నేదేనివచించినపుడు నాశరీరము గడగడ వణకుచుండును. ఇట్టివి షయమునుగూడ ముచ్చడించగలనా?' యని లీలపలికి సుందరి నిజూపి మనకును యేలికకును నూతన వ్యక్తియైన సుందరిని బంపుదమనుచు చిరునగవు నవ్వెను. 'నూతనవ్యక్తినైన నే నా మనయేలికతోఁ మాటాడుట, నాకు మిక్కిలి భయమును, సిగ్గునుగలుచున్నవి. నాపైఁ యీ భారమునంతను వైచిరే!' యని సుందరిబలుక—భీమపాలుని సందర్శించునపుడు మేము నీతోయుందుము, గావున సాహసింపుమని లీలాలాలు లిరువు రును ఒకిరి. ప్రాణముపై యాశను వీడియె నా బెంపుడుతలి దండ్రులను బాసి మా తండ్రినిజూచుటకు బయులుదేరితినిగద. తండ్రిదర్శనమునకు మారు నీదర్శనమైనది. భగవంతునిపై

భారముంచి ప్రియత్నించెదగాక' యని తలచి లీలా, లాలీ సమేతయై మోహినీ భవనమునకుఁ బోయెను. పరిచారికలు వారికి నియమింపఁబడిన కార్యములను నెఱవేర్చుటకై బోయిరి. సుందరి భవనములోనున్న చంద్రికాంత శిలావేదికపై గూర్చుండి యేదియో తలంచుచు, నిద్రించెను.

భీమపాలుఁడు పుత్రికకుఁ గలిగిన యవస్థను గూర్చి వగచుచు శయన మందిరమున బరుండెను. మధ్యాహ్నము మూఁడుగంటలు గొట్టిరి—భీమపాలుఁడు మెల్లగలేచి పరిచారికను బిలిచెను. మోహిని యాతని పిలుపునువిని మెల్లగభీమ పాలుని శయనమందిరమునకుఁ బోయెను. మోహినిని చూచి నంతనె భీమపాలుఁడు మోహనా! తనయా మోహనా! యని కండ్లనీరు గార్చుచు మరల బరుండెను. మోహిని శయ్యవద్దకు బోయి, నిలచి భీమపాలునకు ధైర్యమునుబూనుమనియు, నాటి యుదయమున జరిగిన వృత్తాంతమును జెప్పెను. భీమపాలుడు మోహిని వచించినబలుకుల నాలకించి ఆశ్చర్యముతో— "సుందరియను కాంతా—నీతో వచించినదా—నేను వినగోరుచు న్నాను—పరిచారికలనంపి బిలిపింపుము—'!సుందరి భవనమున చంద్రికాంత శిలావేదికపై నిద్రించుచున్నది. ఆమెనిచటికిఁ దోడ్తెచ్చెదననిశయనమందిరము వీడి వేదికవద్దకుబోయి శయనిం చియున్న సుందరిని మేల్కొల్పెను. రాణియె దగ్గఱకువచ్చి తన్ను మేల్కొల్పినందుల కాశ్చర్యముతో యులికిపడి లేచి నిలువఁబడెను. మోహిని భీమపాలుని యాజ్ఞను సుందరితోఁ

జెప్పెను. సుందరి భయముతో వణఁకుచు భీమపాల దర్శనము నకు బోయెను. భీమపాలుఁ డామెనుచూచి యువతీ! 'నీ దేయూరు? యిచ్చటికేల వచ్చితివి? నీ రాకకు కారణంబేమొ చెప్పుమా?' యని ప్రశ్నింప సుందరి తలవంచి ప్రభూ! నాదీయూరుగాదు, మాణిక్యచూడుఁడను వానియొక్క పెంపుడు గూతురను అరణ్యమార్గ మగోచరమగుటచే మాపల్లెనుగానక తమ పట్టణమునకు చేరియుంటిని. యోగీంద్రుండొకడు—నీవు రాజభవనమునకు బోయినచో నీ యాకలి దీరగలదు—అనిచెప్పుటచే యీ మందిరమునకు వచ్చితిని. ఆశ్చర్యముతో—నీవు మాణిక్యచూడుని పెంపుడు గూతురువా! నిన్నుగన్న తలిదండ్రు లెవరో యెఱుఁగుదువా!"—సుందరి తలిదండ్రుల నామముల నుచ్చరింప భీతినొంది—ప్రభూ! నేనెఱుంగను. అని కండ్లనీరు గార్చుచుండెను—"సుందరీ! నేటి యుదయమున మీ రాణితో వచించిన దేదియో నాతోవచింప గలవా వినగుతూహలము కలుగుచున్నది"—సుందరి (స్వగతముగ) యీ వృత్తాంతమును చెప్పగలను. కీడుగలిగిన గలుగుగాక—యని గతదినమున జరిగినయావద్వృత్తాంతమును బూసగుచ్చి నటుల చెప్పెను. కడుఁగడు వినయవిధేయతలతో వచించుచుండిన యక్కల్కి పల్కులు భీమపాలుని కాశ్చర్యమును గల్పించెను. యోగివచించిన చొప్పున కుమారుఁడు క్షేమముగనె యుండెనుగాని చేష్టాశూన్యుండై యుండెగద! భగవంతుండే తోడై యుండినచో మాపుత్రుండు మాకుదక్కునని భీమపాలుఁ డూహించు

చంపెను. 'రాజా! తామాగ్రహము బూనక సావధాన చిత్తు లయి వినినచో నను తనయునకు వాటిల్లిన యిక్కట్టు యొక్క నిజవృత్తాంతమును జెప్పెదను.' భీమపాలుండందులకు సమ్మ తించెను సుందరి భయముతో భీమపాలుని జూచి, మోహానో దయమునం గాకపూర్వ మెవ్వరెవ్వరి యు బంధములకు జిక్కియుం డిరో—ఎవరి ముద్దుపలుకులకు—ఎవరి ముద్దు గాత్రములకు— ఎవరి ప్రేమాతిశయములకు— యెవరిముద్దు మూర్తికి జిక్కి యుండిరో అట్టివారగు తమ వలపుల రాణిగారగు వారి వల ననే మోసము జరిగినదని బలుక భీమపాలుడుక్రోధోద్దీపిత మాన సుండై—ఓసీ! యిట్లేల బలుకుచుంటివి. చిలుకవలె యేవియో టక్కరిబలుకుల నింతవఱకు బలికి చెవుకూతల నిప్పుడు కూయు చుంటివా! నీవిచ్చోట నుండదగవు. యెట్టి దుష్కృత్యములను జేసి యెఱుంగని నా ముద్దుల మోహనాంగియగు నళినిపై నే రానోహణ జేయుచుంటివా? యని బలుక సుందరి వెంటబెట్టు కొని మోహిని తన శయన మందిరమునకు దోడ్కొనిపోయెను. మోహాంధకారమున సంచరించు వారికేమి గతియొగద.

హా! పరమేశ్వరా! పంజనయునా, దుర్బుద్ధిచే నాతలి దండ్రిలను బాసి నిచ్చటికేల కరుదెంచితిని! పెక్కు గష్టము లువాటిల్లినవి. యోగివచించిన దాదిగ, యంతచే బీడింపc బడిన దానపై యిట్టిప్రయత్నమును కొడిcగట్టితిని. భీమపాల మహారాజు నాపలుకులను వినినంతనె శోకదాక్కిన తాను

భంగి కోపోద్దీపిత మానసుండయ్యెను. ఇంకపరిచారికలతో వచిం చినట్లు చేసి ప్రయత్నమును కొనసాగించగలనా! చరిత్రము నంతయుఁ బూర్తిగ దెలిసికొనియు, నిట్టిభయ మెుంగనేల. మునుల ప్రభువు వద్దకుబోయి, యీ వచనములనె బలుకునా అని మదిదలచుచు మోహినివద్దఁ గూర్చుండెను.

పద్మబాంధవుఁ డస్తగిరి నలంకరించెను. మెల్ల మెల్లగ చీకటులుగ్రమ్మ నారంభించెను. నక్షత్రములు తమ నైసర్గిక ప్రభావమును వెదజల్లుచుండెను. సుందరి మునుల చేవిసద్దకు బోవఁ యత్నించి మోహినినిఁ జూచి, 'అమ్మా! తను పరిచారి కలగు లీలాలోలులు నన్ను మధ్యాహ్నము విడచిరి. మునుల వారిచ్చటికి వత్తురా? మా ప్రభువువారియొద్దకు నన్ను దోడ్కొ- నిపోయెదమని వచించిరి నే మునులబోయి యేలికతో వచిం తునా! యని' ప్రశ్నించి, మేము ముప్పురమును ప్రభావతిని గలసికొంటిమి. ధనాపేక్షఁ గలిగించి యీ రహస్యము నామె వద్దనుండి గ్రహించితిమి. ముమ్మాటికిని నిజమై యుండునుగాని మా ప్రభువువారు రాపలుకుల నాలకించుటయే లేదు. ఐనను ప్రయ త్నించి చూచెదను——మోహిని చిరునవ్వుతో 'అమ్మాయీ! నీవు వచించినది నిజంబె యని పలుకుచుంటివిగాని, యొరుల నిందబాలుసేయుట కొప్పు గొందురా! అయినను బ్రయత్నిం పుము——' సుందరి ధైర్యముఁబూని భీమపాలునియొద్దకుబోయి నిలచి నమస్కృతులాచరించి, "ప్రభూ! ముత్యాలహార చరిత్ర

మును తమ పరిచారికలగు లీలావతి, లాలిగయును, నేనును, నళినిరాణిగారి పరిచారికయగు ప్రభావతివలన దెలిసికొంటిమి. ఆమె మత్స్యమునందు మాయహారమును యెట్లు అమర్చినది, మాతో వచించినది. దానిఁబట్టియే మీతో వచింప ధైర్యమూని తిననినభీమపాలుఁడు కంఠ[illegible]జేసి "ఛీ! నేనిదివరలో నిన్నిచోట్ల నుండవలదని చెప్పియుంటిని. నక్కవలె పొంచుల నీచోటికేల వచ్చితివి? ప్రభావతి నీతో చెప్పెనా! కొండెములు చెప్పుటకు పెన్నిధానమైన నల్లున్నది కొండెగాండ్ర నాలుకల గోయుడనుట బట్టి నను [illegible] చితవో [illegible]బలుకుల బలుకఁ జాలదె. [illegible] చపుబేలికల గొండుప్రభావతి వచించినది చెప్పుచుంటివా. నీవిఁక మారుఁ [illegible] సిద్ధాంతిరిబోయిన్న. లేచిచో దగు శిక్షవిధించెదను. నా యున్నులమిన్న, నా విరిబోడి, నా లతాంగి నాయచ్చర, నా సుదతి, నా కల్కి [illegible], నా వలపుల మిన్నయగు నళిని యిట్టిదుష్కృత్యములఁ జేసినదని యామెను నిందింపబోకు సేయఁదగదు. నీ విచ్చోట నుండవలదని కేకలువేసెను. సుందరి తలవాల్చి భీమపాలుని వద్దనుండి మోహిని యొద్దకుబోయెను. పరిచారిక [illegible] హారములు గొన్నిటిని పళ్లెరముతో [illegible] మోహమునకు బరువైన గదిసెట్టికిఁ గొనిపోయి [illegible]ల్పమునకు జేరియున్న మేజాపై నుంచి వెడలిపోయెను.

సుందరియు నా మతో గూడ [illegible] బోవనుద్దేశించెను గాని, ఆసమయమునకే మోహిని వద్దనె గూర్చుండ వలసి వచ్చెను. మరి

యొక పరిచారిక ఫలహారముల నొకరజిత పళ్లెరములోఁ బెట్టు కొని, ఒకచేతితో జమిపాత్రిఁ బట్టుకొని భీమపాలుఁడు గూర్చు న్నగదిలోనికిఁ బట్టుకొనిపోయి మేజాపై నుంచెను. భీమపాలుడు ఫలహారముల సేవించి చల్లనిపిల్లగాడ్పుల నానందింపఁగోరి భవ నోపరిభాగమునకు బోయెను.

యోగీంద్రుఁడు భీమపాల మందిరమున జరుగుచున్న చరిత్రినంతను దివ్యదృష్టిచే నంతఁ గ్రహించి, సుందరియొక్కకష్టము లబాపుదలంచి వలపోయుచున్న మానసమును వెలిబుచ్చుటకై రాజ మందిరమునకుఁ బయలుదేరెను. రాత్రి సుమారు తొమ్మిదిగం టలు కావచ్చెను. యోగి కోటద్వారమువద్దకు బోయెను. కోటద్వారము నద్దనున్న భటుఁడు యోగికి నమస్కరించి భీమ పాలుఁడుండు తావునకుఁ బోయి, యోగియొక్క రాక నెఱిం గించెను. భీమపాలుఁ డులికిపడి లేచి, మా జన్మము నేటికో సఫలమయ్యెడి నని తలంచుచు, ఆలసింపక వేవేగఁ దోడ్కొని రావలసినదని భటునితోఁ జెప్ప భటుఁడు యోగివద్దకు బోయి, ఆర్యా! యేలినవారి యాజ్ఞయైనది బోవుదమురండని తన వెంట భీమపాలుని యొద్దకుఁ దోడ్కొనిపోయెను. భీమపాలుడు యోగీంద్రునిఁ జూచితనయునికై విలపింప; యోగి బాబా విచా రింపకుము. నీ తనయుఁడు బ్రతికియె యుండెను. ఓర్పుగలిగి యుండుము నెమ్మదిపైని నిజము దేలగలదు: ధైర్యమువహిం పుము. పురుషుండవై గూడ బేలవై యేల విలపించెదవు.

ఈనాఁడు జగత్సింహుని కూతురు నీ మందిరమునకు వచ్చి, యుండలేదా?—భీమపాలుఁ డాశ్చర్యముతో జగత్సింహుని గూతురా! యింకెక్కడి జగత్సింహ సుశీలలు? జగత్సింహుఁడు కారాగార బద్ధుండై యుండెను. అతనిభార్య శిరమును దీయుఁ డని నాజ్ఞవిధించి యుండితినే! —యోగి—భీమపాలా! అట్లేల జేసితివి? అణుమాత్రము యోచింతివి గాదే—మీరు జగత్సింహుని గూతురందురే! మాణిక్యగూడుఁడను వనాటునిగూతు నని నచించి యున్నదే? యని బలుక రాజా! అబ్బాలిక వచింనదంతయు సత్యము. ఆమె చెరయందున్న జగత్సింహునిగూతురే! యీ ద్రోహము నీ ద్వితీయ పత్నియగు * * * జరిగినది. ఓరిమిఁ గలిగియుండుము ఈరేయి నీకా నిదర్శనమును జూపెదను. గావున వేచియుండుము. భీమపాలుఁడు కోపాయత్త చిత్తుండై అట్లాయని దలనూపి, నా భార్యవలననేమో నగింపఁ బడితినాయని గంటమునుండి నీరుఁగార్చుచు, భటునిబిలచి సుందరిని తనవద్దకుఁ దోడ్కొనిరావలసినదని ఆజ్ఞనిచ్చెను. భటుఁడు క్రిందికిపోయి, సుందరిని తనవెంటఁ దోడ్కొనిపోయెను. సుందరి రాజాజ్ఞవలన భీతిజెందినదై నెమ్మదిగ భటునితో భీమపాల దర్శనమునకుఁ బోయెను. మార్గమధ్యమునగనంబడిన జటధారి యచ్చోటి కరుదెంచుటచే నిశ్చేష్టురాలై నిలచి, వానికి నమస్కరించెను. యోగి సుందరి నాశీర్వదించి తన వద్దకు రావలసినదని బిలచెను. సుందరియొక్క భయమంతరిం

చెను. భీమపాలుఁడు చిరునగవుతో, "బాలికా! నీవు పరలో నాతోఁ వచించినపుడు, నీమాటల దోసిపుచ్చితిని. యోగీం ద్రునివలన నీ వృత్తాంతము నంతను దెలిసికొంటిని. భయమొం దక నీవిచ్చోట నుండినచో ఎల్లి యరుణోదయము గాకపూ ర్వమే నీ జనకుండగు జగత్సింహుని జూడగలవని బలికి, సుశీ లను నిర్హేతుకముగ జంపినందులకు విచారించెను. గతించినదా నికి విలపింపనేల!

తూరుపుకొండంతయు దెలుపుబారుటకు ప్రారంభిం చెను. కుక్కుటములెల్ల గూయ మొదలుబెట్టెను. కోటయం దుండు కావలివాండ్రు అంత్యయామమున దెలుపుటకై బాకాలు భేరీలను గొట్టుచుండిరి. యోగి మేల్కాంచి కొంతసేపు భగవ చ్చింతనుండై, భీమపాల సుందరుల మేల్కొల్పి, వారిద్దరను వెంటబెట్టుకొని, కారాగారమువకుఁ బోయెను.

మాణిక్యచూడుఁడు నళినివద్దనున్న కరవాలమును గట్టిగా బట్టుకొని కారాగృహ ద్వారమును బంధించెను. నళిని మిక్కిలి కోపముతో కరవాలమును దూసి వానిపై దిప్పుచుండెను. మాణిక్యచూడుఁడుగూడ తన చేతియందున్న కత్తి నిదిప్పుచు రహస్యమార్గమునుగూడ బంధించెను. కావలివాం డ్రందరును లోపల జరుగుచున్న చిత్రమునంతను జూచుచుండిరేగాని లో నికిఁ జొచ్చుట కవకాశము లేనందున దొట్రుపాటుచే నటునిటు దిరుగుచుండిరి. సేవకుండొకఁ డరుదెంచి భీమపాలునిరాక నెరిం

గించెను. వెలుపలనున్న భటుల యారాటము మందగించెను గాని, లోపల నున్నవారల పోరాటము హెచ్చెను. భీమపాలు డు సుందరీయోగులతో కారాగృహమునకు వచ్చెను. భటులం దరును భీభత్స జెందినవారై తెరవుగానక యెచ్చట నిలచియు న్నవార లచ్చటనే కొయ్యబొమ్మలై నిలచియుండిరి. భటుల చర్యల బాటింపక భీమపాలుఁడు జగత్సింహుఁడుండు గదియొ ద్దకు బోయెను. ఆ గదిని గాయుచున్న భటుండెంత బొబ్బలు బెట్టినను, వారు బాటింపక కత్తులను ద్రిప్పుచుండిరి. భీమపా లుని జూచినంతనె మాణిక్యచూడుఁడు కత్తిఁ ద్రిప్పుటమాని నిలచియుండెను. నళినియు కత్తిని ద్రిప్పుటమాని జగత్సింహు నియొద్దకుఁబోయి నిలచియుండెను. వారి పోరాటమును జూడ లేకపోవుటచే సమనోదరము కాల్వలై పారజొచ్చెను. భీమపా లుఁడు దలుపును దెరచి లోనికిబోయెను. యోగి సుందరులు భీమపాలునివెంట లోనికిఁ జొచ్చిరి నళిని యన్నుగాల్లయు భీమ పాలుని కాళ్ళపైబడెను. భీమపాలుండు కోపోద్దీపిత మానసుం డయి యామెను ద్రోసి, ఛండాలి! నన్ను ముట్టఁబోకుము, ద్రోహపుమేటి నిన్ను పార్థింపవలదని తన్నబోయెను. యోగా తనిని బట్టుకొని, "రాజా! పూర్వోడిల్లు మూర్ఛడిల్లుము. జగత్సిం హుని నిజచరిత్ర మంతయుఁ దెలియగలదు' అని యన మాణి క్యచూడుఁడా భీమపాల యోగులతో బాసెరింగిన దంతయు బాగుగుచ్చినట్లు చెప్పెను. యోగి సుందరిని చేరఁజేరి అమ్మా

యీ! శృంఖలాబద్ధుండై నిలచియున్న పురుషుడే మీ తండ్రి యని జెప్పి, జగత్సింహునిజూచి ఆర్యా! యీ బాలిక నీకూతురు. నిన్ను కారాగార విముక్తునిజేయ సజీవ * *యైయున్న దని బలుక జగత్సింహుఁ డాశ్చర్యముతో నాకెక్కడికూతురు సన్నదుఁగదు. ఆర్యా! నీ పుత్రికా చరిత్రము నంతను వినఁగలవు—మాణిక్యచూడుఁ డపుడు సుందరీ సుందరీ యని పిలచెను. సుందరి తానొనర్చిన యపరాధమునకు క్షమింపఁ బ్రార్థించెను ఈ జగత్సింహునివలన నేర మానంతయును లేదు. నళినివలన జరిగినదని నిర్ధారణమైనది జూచితివా! మెడలోనున్న హారమే ముత్యాలహారము. దానిని దీయుఁడనెను. జగత్సింహుని శృంఖలావిముక్తుని జేయుడని బలుక భటులు జగత్సింహుని శృంఖలావిముక్తునిఁ జేసిరి. ఈ క్రూరాత్మురాలగు నళినిని కారాగారమున బంధింపుడు. ఈ దినమున దీనిచరిత్రము నంతను వినియుంటిని. నళినికిదగిన శిక్షవిధించెదను. భటులు రాజాజ్ఞ ప్రకారము నళినిని బంధింప బోయిరి. ఖైదీదుస్తులనిచ్చి బందేఖానాయందు బంధించిరి.

మాణిక్యచూడుఁడును, భీమపాలుఁడును, యోగి, సుందరి మొదలుగాగల వారందఱును గలసి ముత్యాలహారమును బట్టుకొని మోహనుఁడు బరుండిన భవనమునకు వచ్చుచుండిరి. మోహనునకు స్పృహగలిగెను. శయ్యపైనుండి లేచి దలుపుల దెరచి పితృసౌధమునకు బయలుదేరెను. యోగీశ్వరుండు మొద

లగువారు వానిని సమీపించిరి. భీమపాలుని యానందము * * * * మోహనుఁడు యోగికి నమస్కృతు లాచరింప యోగి తనవద్దనున్న ముత్యాలహారము నాతని మెడలో నలంకరించి మాయ హారమును దు్రించి "రాజా! నీకుమారుఁడు పూర్ణాయుర్దాయుఁడు గావుననే ముత్యాలహారము నీకు చిక్కినది. ధైర్యము వహింపుము' అని పలికెను. భీమపాల నారీకుమారులు ఆనందసౌకర్యపై ప్రయాణముచేసి మోహినీసమీపమునకు జేరిరి.

"నాయనా ముద్దుల మోహనా' యని పలుకుచు మోహిని త్వరితముగ వచ్చి ముద్దుబెట్టుకొనెను. "అమ్మా! మీతనయునకు గండము గడచినది. మీ జీవితయాత్ర నిక ఆనందము గడపుకొనుఁడు: అని యోగి వచించెను. భీమపాలుఁడు లేచి జగత్సింహుని చేతులబట్టుకొని, 'ఆర్యా! జ్ఞానహీనుడనై న్యాయాన్యాయముల గానక నిరపరాధులగు మీకు కఠినశిక్ష విధించితిని. సహజ స్వభావులగు స్త్రీల పలుకులు విని న్యాయా న్యాయముల గానక యిట్టి నీచకార్యముల జేయువారికిహలోక సౌఖ్యమేగాక పరలోక సౌఖ్యముగూడ నశించును. కండ్లుగానక సద్గుణరాసియగు సుశీలకు మిగుల కఠినశిక్షవిధించితిని. నేను మిక్కిలి అపరాధిని. నన్ను మన్నించి నా తప్పు మన్నింపుము' అని పలికెను. జగత్సింహుఁడు కంటనీరుబెట్టి—తమవలన బోషింపఁబడుచున్న తమ నీచసేవకుఁడనైన నేను

క్షమించుటా. ఆ పరాత్పరుఁడే క్షమింపఁగలఁడు_' నేను కడు పాపిని. దుష్కృత్యములఁ జేయుటయందు మిక్కిలి కీర్తి వహించితిని. నావలన అపరాధములుగలవు. ఇదివరలో మీరు నావలనపోషింపబడిరి. ఇఁక నేను మీవలన నేనీరాజ్యము నేలుచుండినను నా అపరాధముల మన్నింపుడు—'మహాప్రభూ! సేవకుఁడు ప్రభువుల నెట్లు రక్షింపఁగలఁడు?'—మీరట్లు పలికినచో నా తప్పులు మన్నించినటుల నా తనయుఁడగు మోహనునకు మీ తనయ యగు సుందరినిచ్చి పరిణయముఁ సేయుము—పాపము లన్నియు పరిహారింపఁ బడుగాక!—

అట్లయినచోఁ మీ యిచ్చవచ్చి నట్లాచరింపుడు. భవత్సేవాపరుఁ డనగు నాకు సమ్మతమే. జగన్మోహనుడు తైలాభ్యంజనాది కృత్యములు నెరవేర్పఁబడినతరువాత, తమఆనందం వెల్లడించుటకై అందరును గలసి విందారగించిరి. సాయంకాలము మూడుగంట లగువేళఁ భీమపాలుఁడు కొలువుదీర్చి, జ్యోతిశాస్త్రజ్ఞుల రప్పించి సుందరీ మోహనుల వివాహార్థము శుభ ముహూర్తమును నిశ్చయింప వలసినదని చెప్పెను. దైవజ్ఞులు శుభముహూర్తమును నిశ్చయింప మఱుచటి యుదయమున పట్టణం బంతయు నలంకరింప బడెను. ప్రజలందరును తమ యువరాజు యొక్క వివాహ వేళకై యెదురు చూచుచుండిరి. యువరాజునకు విలువయగు వస్త్రముల నలంకరించి యేనుగుపై గూర్చుండఁబెట్టి యూరేగింపు టుత్సవము జరిపిరి. పురజనులం

దరును తమ సానుభూతిని దెలుపుటకై పూలహారముల నిచ్చిరి. నాటిరాత్రి సుందరీ మోహనులకు వివాహము జరిగెను. పండిత పామరులకు విలువయగు బహుమతులీయబడెను. పేద సాద లకు కుంటి గ్రుడ్డివాండ్రకు అంగ విహీనులకు అన్న వస్త్ర దానములు చేయబడెను.

—o—

## పదునేడవ ప్రకరణము

—

శిక్ష.

మోహనుని వివాహమైన తదనంతరము భీమపాలుఁడు లేచి, నేను 'చక్రిదత్తునికుమార్తెను బెండ్లాడితిని. అంతగా రూప వతి గాకపోయినను నా వాత్సల్య మామెయం దెక్కుడ య్యెను. మోహినియందు గూడ నా ప్రేమాతిశయములు గల వుగాని అంతగా మిక్కిలికాదు. నేను మోహినీ భవనమున గూర్చున్న వేళ యోగీంద్రులు మమ్మాశీర్వదించి ఫలమొక దాని నిచ్చెను. మోహిని ఆఫలమును భుజించిన తరువాత భగవత్కటాక్షముచే గర్భవతి యయ్యెను. నాఁటినుండియు నేను మోహినీ భవనమునందె యుండుట కలదు. నళిని మందిరము నకుఁ గూడ నప్పు డప్పుడు బోవుట గలదు. దుశ్చరితయగు నకాంత పూర్వముకన్న తేనెబలుకుల బలికి నటనా నాటక రంగమున పాత్రధారియై యుండెడిది. మాయమారియగు నళిని

ల శిక్షింపఁగూడదు?" నా రహస్యమంతయు వెల్లడియైనది. మ
ర్మముచే యొప్పించి మభ్యపెట్టుటకై నను గదువుండకయే భగ
వద్భూతలవలననే నిర్ధారణమైనది. నాకుఁ జెదుకాల మూసన్న
మగుటచేతనే యిట్టి దుష్కృత్యముల జేసితిని. నా నాథుండిక
నన్ను మన్నిచునా? యనను పశ్చాత్తాపించి జూచెదనని కండ్లనుం
డి నీరు కాల్వలై పాఱ దుఃఖించుచు, ప్రభూ! ఈదీనురాలుమి
గుల క్రూరురాలు. జ్ఞానహీనురాలయి కామాంధకారమునఁబ
ట్టి నీచకార్యముల జేసినది. దీనిఁ మన్నింపరేయున, భీమపాలుడు
ఓసీ దుశ్చరితా! నిన్ను మన్నింప వీలులేదు. నీవు కులద్రోహి
వి, భర్తృద్రోహివి, నీపాపిష్ఠనల నాలకింప నే నంగీకరింపను.
నీ పూర్వజన్మ కర్మఫలము నేటితోఁ పక్వమైనది. నీ జన్మాంత
మువరకు కారాగార బద్ధురాలవై యుండుము. ఇదియె నాక
తినాజ్ఞ—సేవకులారా! ఈ స్త్రీఖయిదీని కారాగారమునకు దో
డ్కొనిపోయి బందేఖానయందు బంధింపుడు. కొంతకాలము
నకు బుద్ధికలిగి సుమిత్ర గాగలదు.

---

ఏదునెనిమిదవ ప్రకరణము.

---

పట్టాభిషేకము.

సుందరీ మోహనుల వివాహానంతరము, కొలువుదీర్చి
మోహనుని పట్టాభిషిక్తుని జేయనుద్దేశించి యిట్లు వచించితిని.

మధుసూధనునకింకను మనపై కరుణ గలుగలేదు. నేను వృద్ధుడనైతిని. రాజ్యాంగ విషయముల నన్నిటి నిదివరకే మోహనునకు జెప్పియుంటిని. దక్రివర్మదిక నారాజ్యమును గాపాడు భారమైనది. భారమైనది. వృద్ధులమైన మేము భగవచ్చింతనమున నుండవలెనను కోరిక కలుగుచున్నది. పురోహితాది దైవజ్ఞులార! పట్టాభిషేకమును జరిపించుటకు, శుభముహూర్తమును నిశ్చయింపుడు.'— అని పలుక దైవజ్ఞులు లేచి భీమపాలునకు వందనమాచరించి, "ఈ చైత్రశుద్ధ దశమీ స్థిరవారమున పట్టాభిషేకము చేయుటకు శుభమైయున్నది'— అని బలుక, మిగిలిన వారందరును ఫలహారముల సేవించుచుండ సభను ముగింపయత్నించుచుండ, నిష్కళంకముగ నున్న గగనమును మేఘములావరింప, ఉరుములు, మెరుపులు హెచ్చయ్యెను. భీమపాలుడు సింహాసనమునుండి దిగుచుండ మిక్కిలి భయంకరమగు ధ్వని— ఆ ధ్వని పిడుగుకాదు— ధ్వనియుండొక శబ్దము వినబడెను. 'ఓభీమపాల మహారాజా! నీద్వితీయ భార్యయగు నళినికి పాతివ్రత్య భంగము కలుగలేదు. జగత్సింహునివలనగూడ దోషమునుమాత్రమును లేదు. వారిరువుర పూర్వజన్మ కర్మలవలన అట్టిచరిత్రగలవారుగ కనబడిరి. నీభార్యను విడిపించి, ఆమెతో గూడ నరణ్యములకు పోయి భగవచ్చింతనమున నిమిడియుండుము. నీవంశమునకు జయము కలుగును.' ఈశబ్దమును వినినంతనే వారికియు క్క ఆశ్చర్యమునకు పరిమితి యేమైయుండును? నాటిమధ్యా

హ్నమున సభయందు నళినిగారియొక్క విషయము చెప్పింపబడ, అందరును సమ్మతించిరి. నానాదేశసంస్థానముల సామంతులకును, మిత్రులకును పట్టాభిషేకోత్సవ వార్తాహ్వాన పత్రికలు పంపబడెను.

రత్నగిరి పురవాసులందరును వారివారి సౌధములనెల్ల నయనానందముగ నలంకరించిరి. యువరాజ దంపతులకు తైలాభ్యంగనములు చేయించి విలువగలదుస్తుల ధరింపజేసి అంబారిపై పట్టణమంతయు ఊరేగింపు టుత్సవముతో బయలుదేరి సుందరీ మోహనులు పట్టాభిషేక మంటపమునకు విచ్చేసి వారి కొరకు నియమింపబడిన యుచితాసనముల నధిష్ఠించిరి. సరియగు శతభిషనక్షత్ర యుక్త మిథునలగ్నమున భీమపాలుఁడు సుందరీ మోహనుల సింహాసనముపై కూర్చుండబెట్టి కిరీటమును ధరింపజేసెను. రాజసభ నృత్యములతోడను, మంగళవాద్యములతోడను నిండి మహావైభవముగ నుండెను. నూతన ప్రభువుయొక్క పరిపాలనము. కోటయందు జయభేరులు మ్రోగుచుండెను.

సంపూర్ణము.

